# మనవి

బాబూ!

తెలుగు మన సొత్తు ఎటాడుకొన్న జెల్లును. కాని పలుకుబడి గమనించుట మంచిది. అట్లైన దీపి చెడక, తేట విడక, చెఱుకుపానకము వలె దనియించును.

మన పలుకులకు బరువు లేదు; పరువు గలదు. కుదుపు లేదు; కుదురు గలదు. చక్కఁదనము, చిక్కఁదనము నొడువ బనిలేదు. కఱపించిన డంకము వలె నదుకుకొనును. ఎగుడు దిగుడన్నది మాటాడ గూడదు.

ఇక గమ్మదన మన్న వెన్నతో బెట్టినది. గొప్పదనము రోళ్ల రోకళ్ల బాడినది. కనుకనే "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" అన్నాడు మహాప్రభువు నిర్భయముగా. అనుపే తరువాయి దిక్కులు దీవించినవి. రానురాను ఇది శిలాక్షరమయి తీరినది. ఒక తీరుపేమి? ఆంధ్రసాహిత్య పతాకను జుక్కల కంట విసరినది.

ఇంత వాసిగల్గియు సంస్కృతము చంక కెక్కినది. స్వీయము కొంత గోల్పోయినది. అయిన రాణించినది. తమలమూరక జొత్తిలునా? రంజించు వస్తువు లెన్నివలయు? అందు సంస్కృతపు దినుసు మాత్రము ముప్పాలిరపుకొన్నది. కూచిమంచీయాదు లిందులకు వెలియై పాముకొన్నదిలేదు. కవిబ్రహ్మ యెంత చక్కని పాళ్లగలిపినాఁడు, ఆంధ్రి పుణికి పుచ్చుకోలేదూ, ఎట్లైన గానిండు; మాకు గమ్మని తెలుగన్న గడుముద్దు.

నే నీ గ్రంథము గురజాలలోనుండగా రచించితిని. వ్రాసియు దాదాపేడాది కడచన్నది. అంతక్రితము వీరభారతము వ్రాయదొడ కొన్ని ఖండములు ముగించితిని. ఇంతలో నీ సాంసారికగాథ నాహృమున మెఱసినది. తోడ్తోడ దీనిం గైకొంటిని. ఇదియు బ

వస్తువగుట విశేషము. ఆచారాదికము లాప్రాంతీయములే. లక్ష్య మర్యాద ననుసరించి పలువురాడుకొను జానుపదములు సజీవములు గైకొంటిని. ఇప్పట్ల లోకుల వాకులే వ్యాకృతులు, పలుకుబడి కెడమైన నియమములు సుతరా మవలబుచ్చితిని.

మొనమొన్న గణపతి నవరాత్రుల సందర్భమున నా సాహిత్య జన్మస్థలమగు అమృతలూ రాహ్వానించిరి. అచ్చట నీకావ్యపఠనము జరిగినది. మిత్రుల యర్మిలి కెంతయు నొప్పినది. వారు దీనినంత విడువక శ్రీభాషాసంజీవనీ గ్రంథమండలిలో వెలువరింప సమకట్టిరి. నేనిది తలంచుకొని ముగ్ధుడనైతిని.

వీరు నా చిననాటి సాహిత్య బంధువులు. మామైత్రికి బదునారేండ్ల ప్రాయము. నానాటి కిది క్రొంగ్రొత్తచవులొలికినది. దానికిట్టివే స్మృతి చిహ్నములు.

ఇట్లెంతయు గన్నుల గప్పుకొని గారవించిన నెయ్యురకు కృతజ్ఞతా వందనములు.

౨౪-౧౨-౪౧
పెదకూరపాడు

గ్రంథకర్త

# విన్నపము

నేడు ప్రపంచము సంకుల సమర విషమ పరిస్థితుల చిక్కుకొని యున్నది. కావున ప్రతిపర్యియత్నమును విపణివీధుల ధరపెచ్చరిలుటవలన మందగించినది. ఆకోటికిం జేరినదే గ్రంథముద్రణ వ్యవసాయమును. కాకితము రేటు పెచ్చు పెరుగుటయే కాదు; కొనుటకును గఱవయి యున్నది. ఇట్టి పరిస్థితులలో ఈ కావ్యముద్రణమునకు దలపెట్టుటకు గారణము; ఈ ప్రేమాలోకమున వస్తువు ఉత్తమములగు నాదర్శముల నొప్పారి, ప్రణయ పారమ్యమును ప్రదర్శించి, సరస మధుర కవితావైచిత్రిచే మీదుమిక్కిలి మమ్మెంతయు నాకర్షించుటయ. నేడు తెలుగున వెలువడిన రసవత్తర కృతులలో నిది "తలమానిక" మని మా తలపు.

శ్రీ వేంకట నరసయ్య గారు మాకు ప్రియ మిత్రులే కాదు సోదర తుల్యులు. వారికి మా సంకల్పము నెఱుకపఱచుట తోడనే కడుంగడు సంతసించి రెండు ముద్రణల వఱకు ఈ కావ్యము యొక్క అన్ని హక్కులను మా గ్రంథమండలికి ఈయ నీయకొనిరి. వారి విశాల హృదయమునకు మా ధన్యవాదములు.

ఈ కవిసార్వభౌములు ఇట్టివే రసవత్తరములు, ఉత్తమసంకల్ప సంకలితములు నగు పెక్కు కృతులను వ్రాసి ఆంధ్రిని గైసేయుదురు గాక!

భాషాభిమానులు, వదాన్యులు మా గ్రంథమండలి గ్రంథ ముద్రణ వ్యవసాయమునకు ఆదరము, అభిమానము జూపి జవము-జీవము గూర్తురని వేడికోలు.

అమృతలూరు
24-12-41

భాషా సంజీవనీ గ్రంథమండలి

దోసిఁటఁబట్టి జవ్వనము
    తొంగలి తెప్పలఁ జూఁజలాడు స
న్యాసి సమీక్ష సేయఁగల
    డా? లలనాహృదయంబు దాని క
భ్యాసము గావలెన్ హృదయ
    పక్వము గావలె నేర్పు కూర్పువి
న్యాసము గావలెన్ వలసి
    నన్ దనువున్ద్యజియింపఁగా వలెన్

**కృతిపతి:**

శ్రీ నాగర్లమూడి కుప్పుసామి చౌదరిగారు



" అంమ కుప్పయ్య చల్లని చందమామ "

# అంకితము



౧

అమిత శౌర్య ధురంధరు లాంధ్రు లందుఁ
ప్రాభవ భ్రాజితులు కమ్మ ప్రభువు లందు
ఓడమన్నీలు జాగర్లమూడి దొరలు
అందు కుప్పయ్య చల్లని చందమామ

౨

నా కృతి కన్య నిత్తు నని
నన్ మొగ మింతయి మందహాస రే
ఖా కమనీయ కాంతు లొలు
కన్ నను గన్నులఁ గౌఁగిలించి బా
బూ! కృతు లందుకొన్న ఫల
మూరక పోవునే? మీకు మాకు నీ
లోకము లున్నదాఁకఁ బొడ
లుం గొదలేని యశశ్శరీరముల్

౩

అని వేనోళ్ళం బొగడన్
జను సాహిత్య ప్రసంగ సందర్భమునన్
మన కుప్పుసామి ప్రభువున
కెన లే రనితోఁచె నాదు హృదయమ్మునకున్

౪

ఇంత ధనాఢ్యుఁడైన మన
సిచ్చుట దుర్ఘట మిచ్చెనేనియున్
సొంతముగా వినండు విని
నం గరఁగండు కరంగెనేనియున్
సంతసపెట్టలేఁడితని
జన్మ విశేష మదేమొ? అన్నిఁటన్
మంతున కెక్కె నీతఁడన
మానకళావిభవాభిరాముఁడై

౫

ఒద్దిక లెట్లు పట్టువడె
నో? ప్రతి వాక్యము పంచదారలో
నద్దినయట్లు లుండు విష
య ప్రతిపాదన మంతరాత్మలో
ముద్దిడినట్లు లుండుఁ దన
మోమున పిచ్చిన నవ్వుపువ్వులన్
అద్దమువంటి దొడ్డ హృద
యంబు బయల్పడు నిర్మలంబుగన్

౬

అడుగని వారు లే రడిగి
నంతన నిస్తుల దానధారలోఁ
దడియనివారు లేరు నిర
తంబును వేళకు వచ్చి పొత్తునన్

iii

గుడువని వారు లేరు తనుఁ
గూరిచి కట్టు కథల్ పసందుగా
నుడువని వారు లే రిటుల
నూటికిఁ గోటికి నొక్కఁ డుండెనా!

౭

పొంగినచో సముద్రుఁ డయి
పోవును, పైఁబడి కోపగించినన్
గొంగు పసిండి నిల్పి వినఁ
గోరినఁ గమ్మని పూవుఁ దేనెతోఁ
బొంగలి, సత్కరించుటకుఁ
బూనిన నిస్తుల రత్నశాలలో
బంగరుపూల వాన యిటు
వంటి దొరల్ కలరాంధ్రమండలిన్

౮

ఆ సుకుమార జీవితర
హస్యములన్ గమనించి సత్కవుల్
వ్రాసిన ముద్దులొల్కు రస
వత్తర కావ్యము గాక తీరునా!
ఆ సుజనైక భోగములు
నా రసచర్చలు పూర్వ వాసనా
భ్యాస వశంబుచేత నల
వడ్డవి త్యాగధనాగ్రయాయికిన్

౯

తన ప్రతిబింబముల్ సుతులు
తగ్గ వదాన్యులు తోడఁబుట్టువుల్
కనులకు వెన్నెలై మదికిఁ
గానుకలై తనుఁ జేరి కొల్వ నీ
ధనపతి నిర్విచారముగఁ
దాతల తండ్రుల నాఁటి దాన కం
కణము ధరించి మించె నధి
కక్షముఁడై వ్యవహార దక్షుఁడై

౧౦

మడమ ద్రిప్పక గుంటూరు మండలమ్ము
తొమ్మి దేఁడులు రామ రాజ్యమ్ము గాఁగ
ఏలినాఁ డెంతవారికిఁ జాలినాఁడు
అఖిల విద్వజ్జనాశీస్సు లందినాఁడు

౧౧

మంగళమూర్తి కీ భువన
మాన్యున కీ కృతికన్య నిచ్చితిన్
పొంగిన పాలునై విరియఁ
బూచిన పూలయి కీర్తి చంద్రికల్
పొంగులువాఱె న వ్వొలుకఁ
బోయును గాక విభావరీ జగత్
ప్రాంగణ గర్భ గోళ శిఖ
ర ప్రకరమ్ములు ప్రస్ఫుటమ్ముగన్

# ప్రేమాలోకము

## ప్రథమజ్యోతి

పలనాటి సీమ లోపలఁ
గలగరవా రుండి రందుఁ గలవారలలోఁ
దలకట్టు రాయఁ డాతని
బలఁగమ్మున యునికి పల్లెపట్టు సుమండీ! ౧

కఱ్ఱ పెత్తనగాఁడైనఁ గష్టపడుచు
మంచి సంసారి యను పేరు గాంచినాఁడు
కలము పోటొక్కఁడే లోటుకాని వాని
పలుకె బంగార మాపల్లెప్రజలకెల్ల. ౨

పాడి పంటల కేలోటుపాటు లేదు
తగిన రాఁబడి దానికిఁ దగినఖర్చు
కాని తన పూర్వకృత పాపకర్మ మేమొ?
నాల్గు కాయలు గాచి నానాఁట సమసె. ౩

పిదు గడచినట్లు తోఁబుట్టు పెన్మిటియును
ద్రెళ్ళె నీపెద్ద గొడ్డఁటిదెబ్బ కతన
నడుము విఱిగిన పసర మైనాఁ డతండు
మిన్ను పైఁబడ్డఁ దమకని మేటిగూడ. ౪

ప్రేమాలోకము

మొగులులో నీరు దెచ్చెడు మగఁడు వోయి
కొదమ కాఁపుర మీరీతిఁ బదటఁ గలిసి
తలచెడిన శూన్యమాసమ్ము దాఁటకుండ
మగువ మీనమ్మ తుద కన్న మఱుఁగుఁ జొచ్చె. ౫

మొగము చూడని మలపలు తెగడుచుండ
వదిన మున్నటికల కేమొ బెదరకుండ
మాలదైవము దూఱుచు మాన్యురాలు
వెట్టిచాకిరి కొడిగట్టెఁ బుట్టినింట. ౬

రాయఁ డెటు దప్పినన్ గత్తి "భాయి"గాఁడు
అతని పెండ్లాము రెండాకు లదనమింకఁ
బాప మడకొత్తు పోకయై బ్రదుకవలసె
అన్ని దిగమ్రింగుకొంచు మీనమ్మ తల్లి. ౭

ఆఁడుబిడ్డ కతమ్మున నాలు, మగఁడు
కడుపు శోకము దిగఁద్రావి కాఁపురమునఁ
జేయిఁ గలిపిరి నెల దప్పిపోయె ననఁగ
గ్రుక్కిళులు మ్రింగికొనసాగి రొక్కరొకరు. ౮

"రేజ" పనిముట్టు కొనకుండ రేపు మాపు
అడుగులకు మడ్గు లొత్తిన దాఁడుబిడ్డ
నిండు నీళ్ళాడు ప్రొద్దులై నెలపొడుపునఁ
గడుపు చల్లఁగఁ బ్రసవించె గంగమాంబ. ౯

నలువురు మగబిడ్డల తుదిఁ
గలిగిన దీ యాఁడుశిశువు కాఁపుర మింకన్
వలయెగఁగట్టును లెమ్మని
పలికిరి తనకాన్పుఁ జూడవచ్చిన పడఁతుల్. ౧౦

ఆఱుబయటను గుక్కిలోఁ జేరఁబడిన
రాయనికి దీన గుండెలో ఱాయి వడియె
ఇంత మగమొల్క కొఱ కతఁ డెదురు సూచె
దైవ మామాత్రమును గూడఁ దప్పఁ జూచె. ౧౧

పుట్టి చేటఁబడిన పుణ్యమ్ము గాఁబోలు
పురిటి నీళ్ళువడిన పూటనుండి
తల్లి బిడ్డ గూడఁ జల్లఁగాఁ దేలిరి
ఇచ్చువాఁడు మఱచె నేనిఁ జాలు. ౧౨

పేరు పెట్టు నెడలఁ బెద్దల యాచార
మారఁగూరి శాంత యనిరి గాని
పిల్ల మల్లెమొగ్గ పేరు మోటని కొంద
ఱిష్టపడక పెట్టి రెన్నొ పేళ్లు. ౧౩

ఆకు మఱుఁగు పిందె యల్లారు ముద్దుగా
నాఁటఁ బెఱుఁగు బదులు పూటఁ బెఱిఁగెఁ
బుట్టు మొక్కుఁ దీర్చి పుణ్యాహమున యందుఁ
జెవులు గుట్టినారు చిన్ననాఁడె. ౧౪

ముక్కు మొగము తీరు మూఁడు మూర్తులఁ దల్లి
వన్నె చిన్నె లంత కన్న తండ్రి
నడక వాలకమ్ము నయగారి మేనత్త
చాలు దప్పలేదు బాల కెందు. ౧౫

అమ్మ కమృత రూప మబ్బ కన్నుల దీప
మిరుగు పొరుగు వారి కెంతొ మురిప
మాటవిక కురంగి మైపోయె నింటింటఁ
బట్టుకుచ్చు వంటి చిట్టి తల్లి. ౧౬

చంక దింపక మేనత్త సాఁకుచుండఁ
గనులు గుట్టిన తల్లి మొక్కులము లాడు
కాకపోఁ గాక కన్నులఁ గన్న దగుట
ముద్దు ముచ్చటలం జూచి మురియరాదె. ౧౭

పాలపూసల ప్రాయమ్ము వ్రాలుచుండ
ముందుఁ దా రూపు చేయించి పోల్చుకొనియెఁ
దనకు నటు నిటు పెట్టిన తాట దగులు
నలుగఁ గొట్టించి చేయించె నగలు కొన్ని. ౧౮

హస్త సాముద్రికాదుల నడప దడపఁ
దవిలి చూపించు టెందు కర్థమ్ము గాదు
తల్లి దండ్రులు పని లేని లొల్లిగాండ్రు
తల కొక విధమ్ము భావించి రలపమునకు. ౧౯

వంక పరక దక్కి వలసిన క్లైనచో
గలువడముల తోడి కంబ మెత్తి
గంగ కుత్సవంబు కామక జరిపింతు
ననుచు మ్రొక్కుకొనియె నత్తగారు. ౨౦



# ప్రేమాలోకము

## ద్వితీయజ్యోతి

వదన మెప్పుడు సంతోష సదనముగను
కన్ను లెప్పుడు ప్రేమ సంపన్నముగను
మానసం బెప్పు డానంద మయముగాను
శాంత సౌందర్యలక్ష్మి సాక్షాత్కరించె. ౧

యౌవనారంభ సంరంభ మవ్విధమున
మూఁడుపూ లాఱు కాయలై ముంచుకొనఁగ
జీవమయ మగు నుబ్బెత్తు చిత్రమటుల
నిండుదన మంగకంబుల నివ్వటిల్లె. ౨

వంక వడి లేని కోటేరువంటి ముక్కు
అచ్చమగు రూపురేకకు మచ్చుముక్క
సిరులు చిందెడు చెక్కిఁటి చిన్ని మచ్చ
పూర్ణముఖచంద్రునకుఁ గళాపుష్టి గూర్చె. ౩

తన మేనత్తకుఁ బుత్రకుం డొకఁడె పద్మానాయఁడ న్పేర నా
తని ముద్దారఁగఁ బిల్చు చుంద్రు తగు విద్యాబుద్ధులం దారితే
ఱినబంగారము బిడ్డవోలె నధిక ప్రేమాస్పదుం డైన య
ల్లునితోఁ బొత్తున నారగించి విలసిల్లుఁగా మేనమా మెప్పుడున్.

తన చిన్నారి కొమార్తె పుట్టుకకై పంతాలాడి తోఁబుట్టు వ
న్నను మెప్పించిన దాఁడుబిడ్డ కిది యెన్నం డిష్టమే లేదు మె
ప్పునకై మాకిఁక నెవ్వరే వదినె! పో పొమ్మెప్పుడో మాటకీ
తనకమ్మేలని సాఁకువెట్టి దిగుచుఁ దత్తప్రసంగంబులన్. ౬

మేనల్లుం దనయింటఁ బెట్టికొని గంపెండాసతోఁ గాఁపురం
బానందంబుగ వెళ్ళఁబుచ్చు మొనగాఁ డానాఁడు మాటిచ్చినాఁ
డీనాఁడాలి 'లడాయి' తట్టుకొనలే కేమేమొ వాక్రుచ్చుచున్
మానమ్మానెఁ బ్రపంచవృత్తమిదిసుమ్మా? నాఁటికిన్నేఁటికిన్.

అంకంర మూడ్చి బాలాతపమ్మునఁ గ్రాఁగు
        అల్లుఁగూఁతులనవ్వులాటఁ గాంచి
చలిది కైత్తుంబీటఁగొలువై పరస్పర
        మెంగిళు ల్గుడిచి యుప్పొంగు టెఱిఁగి
పైనఁ బ్రక్కనఁ బండి "పల్లద్దమున" వింత
        పోకిళ్ళతోఁ బ్రొద్దువుచ్చు టరసి
చుక్క బొట్టుల నీడఁ జూచి బాగోగులు
        సవరించుకొనెడు దృశ్యములు గాంచి

పొదుపుకథలకుఁ దగు నెత్తిపొదుపులకును
గువ్వపిట్టలవలెఁ బెనఁగొనుటఁ జూచి
అధిక సంతోషభరితుఁడై హాలికవరుఁడు
చూచి చూడక కాలమ్ము త్రోచిపుచ్చె. ౭

ప్రేమాలోకము

తోఁబుట్టు విలపించి దుమ్మెత్తి పోయుచోఁ
బురికట్ట దిల్లన్న బెరుకు కొంత
ఇంటి కైనట్టిదే కంటగించుటఁ జేసి
మునుపడఁబో దన్న వనట కొంత
తాత తండ్రిలనాఁటి తగిన సంబంధమ్ము
తెగిపోవునే యన్న దిగులు కొంత
ఇంత పుట్టినమీఁద నెడపుచో మున్ముందు
కొంప గూలు నఁటన్న గోడు కొంత

ఆత్మ నెక్కొని తనికెడు నారటమునఁ
గాయ్వ లటు నిటుఁ బెనఁగెడు కారణమున
నిప్పులం బొర్లిన ట్లయి నేఁ డదేమొ ?
గండకత్తెరఁ గొల్వయ్యెఁ గన్నతండ్రి. ౮

తన కేమి మగవాఁడు తల్లి కూఁతుల ముద్దు
చెల్లింప వలె నన్న చింత లేదు
అయి పయి వచ్చినట్లైన నమ్మెదానఁ
బడి యేడ్చు ననుబుద్ధి వొడమ లేదు
నలువురితోఁ బాటు నడవళ్ళు జరిపించి
"సై" యని తలయెత్తు జాడ లేదు
ఇల్లు గుల్లగుట గా కీ పాడు పీడైనఁ
దలఁగి సుఖింపఁగాఁ దలఁపు లేదు

పదుగు రే మందురో యని పాడిదొఱఁగి
ఇంటికిం జిచ్చు ముట్టించు టెంతపాటి
ప్రాణముల నొల్ల నిట్టి సంబంధ మనుచుఁ
గత్తుల న్నూఱుచున్న దాకన్నతల్లి. ౯

గొడ్డుపై గోదపై నొఱ గొడ్డియములు
అలబలమ్ముగఁ జెలరేఁగె నన్నియెడలఁ
గండ లుడికించు చున్న నా నిండుకుండ
తొణఁకి యెఱుఁగదు నిజముగా దొడ్డతల్లి. ౧౦

తల్లి దండ్రులు కడుపున దాఁచుకొనిరి
అత్తమామలు కన్నుల కద్దుకొనిరి
చుట్టపక్కాలు కొండగాఁ జూచుకొనిరి
అంత కింతయ్యెఁ దుదకు మానమ్మ బ్రదుకు. ౧౧

నులివెచ్చ నోగిరమ్ములు త్రికాలమునందు
నడి మంచమునకు మున్నాడి నడుపు
కోడితో మేల్కాంచి గ్రుక్క ద్రిప్పక యొంటి
ఱెక్కపై నిల్లంత చక్కఁబెట్టు
ఇంట జిట్టునఁ జీదిరేని రేవగలంత
తడయక సేవకై నడుము గట్టు
ముడిపదార్థములఁ జొప్పడు నాణె మెలయించి
ఇనుమడి యమ్మకమ్మునకుఁ దెచ్చు

ఇంత ఘటకురాలి కీబహుమానమా!
కాల మన్ని యెడలఁ గలిసిరాదు
పరువు డిగ్గ నుఱికి పడిగాపు లున్నచో
మేరఁ దక్కి చేదు మ్రింగవలయు. ౧౨

సమయ మెడఁగని రెం డంకణముల మిద్దె
నాల్గు కుంటలభూమి నే నాఁడొ యన్న
అష్టదిగ్బంధన మొనర్చె నందు కతనఁ
బాలలోఁ బడ్డ బల్లియై పరితపించు. ౧౩

తెక్కులాడక డొక్కాడ దెక్కుడైన
బంధువులకన్న నెయ్యెడఁ బరులె మేలు
తిట్టులంబోయి మెసవెడు తిండికన్నఁ
గలఁకఁబాఱక త్రావెడు గంజిమేలు. ౧౪

తండ్రి కడచన్న బిడ్డకు దారిఁ జూపి
‘‘వై’’ దొలఁగి యుండ మీ నమ్మవాంఛ సుమ్మ
దైవసముఁడగు కొండంత తండ్రి కన్నఁ
దలఁప నేకులబుట్టంత తల్లి మేలు. ౧౫

మంచము వట్టి భర్త గతిమాలిన కూటికిఁ బోవఁ బంచె నీ
వంచన లేని తల్లి తలవ్రాల్చెఁ గుమారు నొకింటివాని గాఁ
వించెడి భార మన్నదని వెట్టికి గ్రుక్కెడు ద్రావి యోర్పుమైఁ
గొంచక ప్రాణగొడ్డములకున్ గుఱియైనది నాఁడు నాఁటికిన్.

మగఁడు గతించునాఁటికిఁ గుమారునకైదవయేఁడు మాల్మికిన్
దగిన వయస్సు రాయఁడు సదా గమనించుటఁ జేసి కుజ్ఞవాఁ
డగణిత బుద్ధివైభవ సమన్వితుఁ డయ్యెఁ దదాది నాతఁడున్
దిగులు దొఱంగి కాఁపురము దిద్దుటకు న్నియమించె నల్లునిన్.

పగ లెటువోక సొంతపనిపాటలఁ బ్రొద్దులువుచ్చి రాత్రులన్
దగినట్టు లర్థి గ్రంథపఠనంబొనరించుచు ముద్దుకోడలిన్
నగవులరాణి విద్యకు ననాగతముం బురికొల్పు నీవెసన్
దగులముముమ్మరించి పురిదాల్చిన విస్వరి ప్రేమ బంధముల్.

నిముసము చూడకే నిలువనేర రతండు పొలమ్ము చుట్టిరాఁ
దమకముచూపుఁ గన్నులను ద్రావుఁ బదింబదిఁ బల్కరించునె
య్యములకు లోఁగు నింతకొకఁడా? పరిపూర్ణ రసప్రలుబ్ధ మా
భ్రమరము తేనెలానఁగల భాగ్యము నీకుసుమంబునోఁచెనా?

కూఁతు రల్లుఁడు నొక్కెడఁ గూరుచున్నఁ
జుఱచుఱంజూచి తల్లి చిచ్చుఱుకుచుండు
వయసువచ్చిన బిడ్డకీ వాలకంబు
సారె సారెకు సంతాపకారియయ్యె. ౨౦

తావు లీనెడు పొందమ్మి పూవు నందు
సోలుచున్నది చలిగాలి చొక్కుదీఱ
ఎఱుఁగ దిసుమంత తుమ్మెద మఱుఁ గటంచుఁ
దా గ్రహించునె గజదంతతాడనమ్ము. ౨౧

కోమరుని ముద్దుముచ్చటలకుం దతివేచిన మీనమాంబకున్
నిముసము నిద్రచొప్పడదు నిండుమనంబు ద్రవించుచుండు నీ
క్రమమున గాలిమేడలను గాంపుర ముండియు భావనాసము
ద్రమునకుం దెప్పంగట్టెంగడం దాంకునొ తప్పనొ? పోటుపాటులన్

శాంత మాతామహుండు భాగ్యవంతుం డందు
గంగమాంబయె తన కేడుగడయ గాన
వచ్చి కలిసిన దాయా స్తి వఱదవోలెం
గనుక నీమెను బట్ట పగ్గాలు లేవు. ౧౩

ఆమెచూపు వేరు నభినయమ్మును వేరు
మాటమంతి వేరు మనసు వేరు
మగని వంకవారు మాఱట దయ్యాలు
తండ్రి వంకవారు దైవసములు. ౧౪

తల్లిదండ్రులు కడచన్న పిల్లవాండు
ఆ స్తిపాస్తులం దమకు నీడైనవాండు
చూడ ముచ్చటం గొల్పు నాజూకువాండు
అల్లుండు లభింపవలె నని యభిమతమ్ము. ౧౫

కట్టడి చేయుచో బెరుకు గానదు నోరికి వచ్చినట్టు ల
ట్టిట్టనుచుండుం బెన్మిటికి నేనిం దలంక దిటుల్ స్వతంత్రమై
పట్టము గట్టుకొన్న చలపాది మనంబున కెక్కు_వా రిలన్
బుట్టిరొ? పుట్టరో? యెటుంగంబోలునె? ధాతకు వాని తాతకున్.

ఈఱతాఱలు పలుమారు లెంచుకొనుచు
బలసి ముకుఁద్రాటఁ గాల్గు)వ్వ పసరమట్లు
మఱఁదలి మనస్సు వోనాడి మాన్యురాలు
ఇలు వెలార్చు నుపాయమ్ము సలుపఁ దొడఁగె. ౨౭

గాడు పట్టినచోఁ దూలనాడు నెడల
హద్దుప ద్దెంతవారికి నవసరంబు
విప్రతీపంబుగా నాడు వెడఁగు బుద్ధు
లేల గైకొను నన్యులమే లోకింత. ౨౮

తలపై నిప్పులు వడ్డదాదిఁ దన కర్తవ్యంబు గుర్తించి పూ
వులఁబూజించిన మీనమాంబననిశంబున్ అంపపుం గోఁతగాఁ
గలహించెన్ వెలలించెఁ దుట్టతుద కీ కార్యంబు గట్టెక్కనన్
బులియున్నేఁక యునొక్క రేవుబడితా)వున్నాంతిద్దై వాఱఁగన్



# ప్రేమాలోకము

## తృతీయ జ్యోతి

కాలచక్ర భ్రమాపాదకమ్ము లగుచుఁ
బ్రకృతితత్త్వ మహత్త్వ సంపదలు పొదలు
మానవ ప్రవృత్తి విజ్ఞాన మయము గాన
మంచి చెడు లందు నిందు గుర్తించు చుండు.

మచ్చు నాల్క లున్న మానవజంతువుల్
ముం దిఁకెట్టి పుట్టు పొందఁగలవొ!
ప్రకృత లౌక్య మరయఁ బరవంచనమె కదా!
అందెచేయి రాయఁ డందుఁ గూడ. ౨

తాను గూడ దన్నుఁ దలఁ ద్రుంచువా రేరి
గుండెకూడు పట్టకుండు టేల
వ్రేలు వంక వెట్టి వెన్నుఁ దీయుటె గాని
నడుపుచున్న దతఁడె నాటకంబు. ౩

ఆఁడుపడుచు వెలలె నాఱుపో రిఁక లేదు
మిట్టసిగలఁ బూలు గట్ట వచ్చు
సతియుఁ బతియు మంచి సంబంధమునకయి
మిన్ను మన్ను వెదకి రెన్నొ నాళ్లు. ౪

శాంత బాలకమున వింతమార్పు ఘటిల్లె
మూఁగ నోము నోఁచె మొదటి నుండి
కన్నవార లింత గమనింప కుందురా ?
కాల మహిమ వారి కనులు గప్పె. ౫

వచ్చిన సంబంధంబులు
వచ్చియు వచ్చకయుఁ గొన్నినాళులు జరిగెన్
లచ్చలు గల బంగారపుఁ
బిచ్చుక గావలయు నంట పెండ్లి కొమరుఁడున్. ౬

పచ్చికలి వోవువా రని
గచ్చులగంగ లని పలు రకమ్ములు గాఁగన్
వచ్చిన వారల కెన్నో
మచ్చలు గల్పించి రాలు మగఁడును దోడై. ౭

పప్పుం బువ్వ ప్రమాణము
చెప్పటి కప్పుడ మఱొండు హిత వగు నెడలన్
నిప్పుకలు దోయిలింతురు
గుప్పెడు దుమ్మెత్తి పోసికొందురు తలపై. ౮

టంగు దెగి రాయఁ డూరం
బింగళి నాగన్న కొడుకు భిక్షాలునకున్
బంగారు బిడ్డ నీఁదలఁ
చెం గోమటి చేరమాడి చిట్టచివరకున్. ౯

చేదు మేసి కొంత చేపట్టి నాగన్న
అంత గలిసి లక్ష కదన మాస్తి
మంది గడ్డి గఱచు మానవాధములకుఁ
బాప మటులఁ బెరుఁగు బలిమి, కలిమి. ౧౦

కడచిన వత్సరంబె సతి కాలము చేసినఁ దల్లి చావు బి
డ్డఁడును గతించె నప్పటి యెడాటము సైపక మాఱు పెండ్లికిన్
గడఁగిన రాయఁడిద్ది సడికట్టి కుమారిక నిత్తు నన్నఁ దా
నొడఁబడియుం గుమారకున కొప్పుకొ నెన్ హితు లేమి సెప్పిరో?

కట్టఁ గుడువ నింత గల్గి యున్నం జాలుఁ
దెలివి గిలివి మాట దేవుఁ డెఱుఁగు
ఉన్నవారి పోటి కూరు నాఁ డోపునా?
పొడిచినారె చదివి మిడుకువారు. ౧౨

ఉన్నదే తిన్నఁ జాలు నా కన్నబిడ్డ
త్రాగి తలఁబోసికొనవచ్చుఁ దరతరములు
చదువు సందెలు లేకున్నఁ గొదువ లేదు
జరుగు లెమ్మని కొడుకును జన్నివిడిచె. ౧౩

ఉన్నవారి బిడ్డ కూరంత చుట్టాలు
ముక్కిఁ డైన మదన మోహనుండు
చదువు లేక యున్న శారదా విగ్రహం
బెన్ని యున్న పేద కిహమ? పరమ? ౧౪

అఱకాలు మన్నుగా కబ్బమూఁపున దోఁగెఁ
గుంటుపిచ్చుక వంటి కుక్కితొడలు
అంకవన్నియవోని యమ్మచేతుల సాఁగెఁ
గుంటజంగలవంటి గొగ్గి కాళ్ళు
పనికత్తె సందిటఁబడి ప్రత్యహము గ్రాఁగె
ముడి విప్పి విప్పని గిడస నడుము
అరయిక తక్కువై మొఱటచేఁతల లోఁగె
ముడుఁగఁబాఱిన సొట్టముక్కు మొగము
మిట్ట నొసలు పెద్ద మిడిగ్రుడ్లు వెడ బొమల్
దోనె కడుపు వింత దొప్ప చెవులు
ఏల నచ్చె వారి కిటువంటి భిక్షాలు
పెట్టిపుట్టె నేమొ పెండ్లికొడుకు. ౧౫

అబ్బ చూడఁబోవ నాజానుబాహువు
కూరుచున్న గుబురు గున్నచింత
అంతవాని గర్భమందు జన్మించి యీ
కుక్కమూతి పిందె కులము చెఱచె. ౧౬

ఈ సంబంధము గోరి వచ్చిన హేమా
హేమీలు నుగ్రామాపులున్
గాసుల్, రాసులు, మళ్ళు, మాన్యములు ప
క్కా లాంఛన స్ఫూర్తితో

బాసల్ సేసిరి యీ యగస్త్యుఁ డిఁక గుం
భద్రోణి వాఃపూరమున్
దోసిల్ పట్టునె? తొండ రేమిపుడు చూ
తున్ రెండనుర్ నేర్పుగన్. ౧౨

ఆ కాలమ్ము గతించి నీటి యొర చాలై పోయె లోకస్థితుల్ మోఁకారించిన వారె తుట్టతుదకున్ మూచూడకున్నంతలో కాఁక ల్దక్కి మహాత్ముఁ డిప్పటికిఁ బగ్గాలేమొ చేపట్టినాఁ డీ కళ్యాణ రథంబు సాగఁగలదా? హేరాళ ధారాళమై.

ఒకగా నొక్కఁడు పోఁగఁ దక్కినసుతుం డున్నందుకిన్నాళ్ళకార్థిక సంబంధము లభ్యమయ్యె నిఁకఁ దాఁ దీరైన చుట్టమ్ముగాఁ ప్రకటింపంబడవచ్చు చుట్టఱిక మల్పమ్మైనచోఁ గాదె నాటకమాడం బనిగల్గు లేనియెడఁ గష్టమ్మేల గన్పట్టెడుర్.

లగ్నము నిశ్చయించుకొని లౌక్యవిధానము లాచరించి సంలగ్న మనస్కులై రిరుబలంగములందు వరుండు మాత్ర ముద్విగ్నమనస్కుఁ డయ్యె నవివేకమున న్నిజరూప చింతనామగ్నుఁడుగాక యన్నిఁటసమర్థుఁడువోలె నటించు నెంతయున్.

ఇలు దొరికి వచ్చు బంధుల పొంత నొక వింత
క్రొత్తందనము సూపి గుస్తరించు
తన వింతవాలకమ్మున కేవ పొడసూపి
నగువారిఁ గని వెడనవ్వు నవ్వు

ఆపాద మస్తకం బఱిగొఱ దోడి కట్టి
ముడిజాఱ నొయ్యారి నడక నడుచు
పరిమళ ద్రవ్య సంభారమ్ము లెగఁ బోసి
గాలి పాటున బయల్ గౌఁగిలించు
ఈల సంగీతమున గొంతుకోలు నిమురు
పచ్చి శృంగార కళలకు బమ్మరించుఁ
గాలి తాఁకునఁ బలుమారు నేల వ్రేయుఁ
బిచ్చి బాగుల వలకారి పెండ్లికొడుకు. ౨౧

ఒంటిపాటునరూప ముపలబ్ధమై నిండుఁ
దలఁపునఁ దీయని కలఁకవాఱ
వలపు వడ్డికిఁ బాఱు వట్టి చిట్టకముల
చెలువున మేనెల్లఁ బులకరింపఁ
జిత్తమ్ము పలచనై చేఁబెట్టి కలఁచిన
క్రమమున నంతంతఁ జెమట వొడమ
ముడివడ్డచో నింకఁ దడయుటా! తలమున్క
లను నూహాలకు వెచ్చఁదనము నిగుడఁ
గుడుచు నపుడు గొంతు గూర్చుండు నప్పుడు
నిదురవోవు నపుడు వదరునపుడు
తలఁచి వలఁచి కలఁచి తఱచినాఁ డాయాస
పడినవాఁడు ముందు వడునో! చెడునో! ౨౨

చెలికాండ్రు గువ్వగోల్లాని
తల కొకతీరాడుచుండఁ దాచ్చారముగాఁ
గలఁ గన్న వానిబలెన
వ్వాలయఁగ నేమేమి యనుచు నూడని బాడున్. ౨౩

తన నీడ కులుకు నితరము
వినఁగోరు తలంపు లెసఁగ వినుకలిఁ దక్కుఁగా
బనిపూని నడుచుఁ దోఁచక
వెనుకాడుం జెడిన పడిన వెంగలి వోలెన్. ౨౪

నిదురమ బ్బేమయ్యె నిన్న మొన్నటినుండి
వేగుఁబోక పడంతి వెన్నుదాఁచె
అలసత్వ మేమయ్యె నానాఁటి కానాఁటి
కుత్సాహరభస ముబ్బాఁతలూఁచె
విన్నఁబా టేమయ్యె వినుకలి తఱచుగా
ఎమ్మె లొండొంటిపై ముమ్మరించె
ఎగ్గుసి గ్గేమయ్యె నిల్లాలి పొత్తుకై
మోహాతిరేకమ్ము మొగ్గఁ దొడిగె
నాఁ డోకేఁడు గాఁగ నాగన్న భిక్షాలు
కనులఁ గేలుకొలిపె గడువుదినము
కాలమూర్తి వీని కళ్యాణఘట్టమ్ము
విసరివైచినట్లు వేగవచ్చె. ౨౫

కాకి కెంగిలిలేని గడప పచ్చదనంబు
  వియ్యాల వారికి విందుఁ గుడుపుఁ
గఱువు కాలము లేని కల్యాణపుంగొట్లు
  నడవళ్ళ వారికి నోడలు నింపు
మంచి సెబ్బర లేని మఱప గార్హస్థ్యంబు
  పబ్బాల వారికిఁ బరువు నిలుపు
ముద్దు ముచ్చటలేని ముడి సాంప్రదాయమ్ము
  సంబ్రాల వారికిఁ జనువు నెఱపు

ఆత్మ లన్నఁ గ్రొత్త యాకారములు గ్రొత్త
పనులు గ్రొత్త పలుకుబడులు గ్రొత్త
ఎట్టులైన నేమి పట్టుపగ్గము లేక
పెద్ద గుఱ్ఱ మెక్కెఁ బెండ్లికొడుకు. ౨౨



# ప్రేమాలోకము

## తురీయ జ్యోతి

తల్లి దండ్రుల యెదుట శాంతాకుమారి
స్త్రీ జనోచితముగ సాహసించి కొంత
సిగ్గు తెర నొలగించి వచించెఁ గాని
ధనపిశాచములకుఁ బ్రేమతత్వ మేల? ౧

ఇంతకుఁ దక్కనేని జనయిత్రి విషమ్మును బుచ్చుకొందునం
చెంతయుఁ బంతమూనెఁ దన కీ బెడఁదంతయు నేలపొందు దే
శాంతర మేఁగువాఁడ నను చాజనకుండు వచించెఁ గాఁపుర
మ్మంతయు గంగపాలగు నటంచు వచించిరి చుట్టపక్కముల్

వండినకుండఁ దీయకటు వారును శాంతయు నెన్ని పస్తులో
యుండిరి చూడలేనిపౌరు గూరడఁబల్కిరయు నింటికైన మీ
రొండొకఁడైన నెల్లు పసి దూరక యట్లనుగాని మిమ్ముఁగా
కుండఁ దెగించి పోవ మనసొప్పునె లెండని యూరడించినన్.

కన్నులనీరు దేఱఁ దన కన్నకొమార్తను జేరఁ జీరి నా
పున్నెముపంట! నీమదికిఁ బుట్టెనొ? గిట్టనివారు సెప్పిరో?
అన్నెము పున్నెమే మెఱుఁగ వన్నది దప్పవు పెట్టిపోయఁగా
నున్నఁగదా? మనుష్యులిటు లూరక చిచ్చుఱుకందలంతురా?

అందఱవో లెఁగాక పనులన్నిఁట నేర్పరి రేపా మాపా? ఖా
మందగు నిట్టిచోఁ బనికి మాలినదానవు గాక పెండ్లి నాఁ
గొందల మంద నేల నిను గూర్చి సుఖింపఁ దలంపుగద్దు మా
కందఱ కేరికైన సిరు లబ్బినఁ గా దనువార లుందురా ?

అందమునం గొఱంత గలదా ? నలుపైన సిరున్నదా ముఖం
బందున తల్లిచాలు గలఁ డందురు చేరెఁడు కన్ను లెంతో చ
క్కఁదనమైన ముక్కఁటులఁ గన్నులుగుట్టు వరాలతండ్రి నీ
కెందుకు నచ్చలేదో? దురదృష్టముగాక మఱేమి కూఁతురా!

ఆస్తికి లోటులేదు మఱో కాఱడి లేదఁట నత్తగారితోఁ
గస్తియులేదు మామ ముదుకం డిటు నీ వొకదాన వే కదా!
'ప్రస్తుత' మందు నిందు విభవంబుల కెల్లను రాణివైన నీ
విస్తుల గౌరవ మ్మరసి నిచ్చలు వొంగెద మెల్లభంగులన్.

కూఁతులఁ గన్నతల్లులకుఁ గుత్తుకబంటి సుఖంబఁటందురే
కూఁతుర! కన్న నేరమునకు న్మరియాదగ దాఁటిపోవుటే
నీతి ఫలాని పిల్ల జననిం జెలకట్టఁగ నీదఁటన్నఁ బ్ర
ఖ్యాతికి లోటురాదె పలుగాకులు లోకులుఁ బ్రువ్వఁదిట్టరే?

అల్లుఁడు పల్లెకొండయిన నత్తకు మామకు బంధుకోటిలో
నెల్లెడ గౌరవంబు పరువెంతయుఁ గన్నుల కద్దుకొందురే!
తల్లి! ధనంబులేక కడుఁ దన్నుబలంగములేక కాసుకుం
జెల్లనివారితో మనకుఁ జెల్లునె? యండలు కొండలన్నిఁటన్.

ఎక్కడ దిక్కుమాలి వరియింతువె? గర్భదరిద్రు నెందు కా
చక్కఁదనంబు పైమెఱుఁగు జన్మకు నమ్ముదురే? యిదంతనా
యొక్కతె బాగుకమ్మ? తెలివున్నది పిన్నవుగావు సర్వమున్
జక్కఁగ గుర్తెఱుంగుదువు చర్వితచర్వణ మెంత చెప్పినన్.

అని తన తల్లివల్క హృదయమ్మున రేఁగుతుపానుకన్నులన్
జనికెడుబిడ్డఁ జూచి కలుషించి వచించు నిదేమికర్మమే!
మునుపడఁబోవు నాదు కడుపుం జెడఁబుట్టితి వెవ్వరైననున్
బనివడి దూఁకుదూఁకుమను వారలె వెన్కనువారలుందురే.

అనుచుఁ జెలరేఁగు కర్కశ మాపలేక
ముందఱకు వ్రొగ్గి లబ లబ మొత్తుకొనుచుఁ
బట్టి పల్లార్చు పెనుభూత మట్లు లడరి
తఱియ నేతెంచి యంగుళీ తర్జనమున ౧౨

ఎవ్విధిఁ జెప్పి చూచిన మతేమి ఫలం బొడఁగూడ కద్దువా.
రెవ్వరొ? చూతునంచు బెదరించి చనెం బెడకట్టితల్లి యిం
కెవ్విధిఁ దప్పఁ గాదనుట కెవ్వరు కన్నులు లేని లోకమా
జవ్వని నాడిపోసికొన సాగె నొకించుక మాఱువల్కనన్.

ఆయమ కాదుకూడదనెనా సరి లేకొకఁడైనఁ బ్రాణముల్
పాయుట వాస్తవంబు చలపట్టి పరారగుఁ దండ్రి తానిఁకఁ
జేయున దేమి? వారిటు నశించిన లోకులు దూయఁబట్టినన్
గాయముపాయునో? ప్రియునికౌఁగిటఁ జేరునొ తోఁచదింతకున్

కనుపుచ్చుమ్మలుచుట్టఁ గన్న నేరమునకా !
కాలవాహినిలోనఁ గలిపికొనుట
పాలమారఁజన్నిచ్చి పోషించినందుకా!
కన్నీటి ముత్యాలకాను కిడుట
మురిపాలబిడ్డ మలమూత్రములఁ దోఁగినందుకా?
యమయాతనల సాగనంపుకొనుట
బొమ్మపోలికఁ బూలఁ బూజించినందుకా?
హృదయ సంబంధంబు ద్రెంపికొనుట
విశ్వమానవకోటికి వెఱ్ఱిగాని
వెళ్ళిపోయెడు నపు డేది వెంటరాదు
తనకుఁ గాకున్నచోఁ దల్లి దండ్రు లేమి ?
తుదకు జగమంత వెగటుగాఁ దోఁచితీఱు. ౧౫

ఆమె హృదయమ్ము శూన్యదేవాలయమ్ము
కామదేవార్చనకుఁ దావు గానరాదు.
వలపుకాఁ డిట్టి జీవచ్ఛవమ్ముకేడ్చి
ఏమనుభవించునో రుద్రభూమిలోన. ౧౬

ధర్మదేవతవంటి శాంతాకుమారి
స్వర్గ నరక ప్రవాసమ్ము సలిపి తుదకుఁ
ప్రేమదాసున కేభిక్ష వెట్టఁగలదొ!
కామదాసున కేమొడిఁగట్టఁగలదొ! ౧౭

## ప్రేమాలోకము

ప్రేమతపస్సు ఫలించిన
శ్రీమతిసౌభాగ్యమింకఁ జెప్పఁ దరమ్మా!
వ్యామోహ మంతరించినఁ
బ్రేమకుఁ బ్రతిఫలము గానిపింపదు జగతిన్. ౧౩

త్రావఁ దలకొన్న యమృత పాత్రమున యందు
విసము పడఁబోసి చన్న దావెట్టితల్లి
హాలహాలమైన విధిలేక గ్రోలునేమొ?
శిరము పంకించుచున్న దా స్తరణమందు. ౧౪

సుమ సుకుమార గంధముల సోలిన చల్లనిగాలి మెల్లఁగా
నుమిసిన కమ్మతావులకు నూర్పులెదుర్కొ నఁ జిత్తశాంతికై
కుములుచు భావవేదనలకున్ గురియై ముసుఁగుం దెమల్చి నే
త్రము లరవిచ్చి చెక్కిటఁ గరంబిడి యోచనసేయు నాత్మలో.

కవపాసి యల్లాడు కలరవాంగన పూను
బ్రహ్మచర్యమున కే భ్రాంతి గలదొ?
పుత్రుసమాధిపైఁ బొగిలిపోయెడు తల్లి
కన్నీటి ధార కే కాంక్ష గలదొ?
కోలపాలగు లేఁటి కొమ్మకై వాపోవు
మగ లేడి దృష్టి కే మమత గలదొ?
పూఁబాళె దొరఁగిన బొటబొట సొనజేరు
ఎలదీఁగ పాటు కే ఫలము గలదొ?

ప్రేమపేరఁట జరుగు నప్రియములకును
అంతరార్థము వివరింప నలవిగాదు
జన్మమెత్తిన ప్రతి జీవి జగతిలోనఁ
గష్ట సుఖముల కెపు డొడిగట్టవలయు. ౨౧

సాగర స్వామి రాజాబిల్లి యేమౌనొ
ఉప్పొంగుచుండు వాఁ డున్నవఱకుఁ
దొలకరించిన నోడల్ పులకించి భూదేవి
పచ్చ పుట్టము దాల్చి పసుపు లెత్తు
మధుమాస మరుదెంచి మరులు కొల్పెనొ లేదొ
పుష్పవతుల్ దేనె పుక్కిలించు
ఇనుఁ డేమి "దినవెచ్చ" మిచ్చి పోషించునో !
ఎదురు తెన్నులు చూచు నుదయలక్ష్మి

జీవదీపకముల స్నేహమ్ము జీర్ణించి
ప్రేమవర్తి వెలుఁగఁ బ్రియుల మనసు
ప్రతిఫలమ్ము దక్క ప్రత్యక్షసౌఖ్యంబు
ననుభవించుచుండు నహరహంబు. ౨౨

ఆకాశ వీధిలో నవని గర్భమ్ములోఁ
దలక్రిందయి తపమ్ము సలుపఁగలదు
శారదజ్యోత్స్నలోఁ జండాతపమ్ములో
మెఱుఁ గెక్క మిల మిలఁ బఱవఁ గలదు

అమృత రసమ్ములో హాలాహలమ్ములో
నని శమ్ము జలకమ్ములాడఁ గలదు
బాహ్యప్రవృత్తిలో భావ జగత్తులోఁ
జిత్రరూపము ప్రదర్శింపఁ గలదు

అజర మమర మనిర్వాచ్య మప్రమేయ
మైన ప్రేమ రహస్యమ్ము నరయువారు
విశ్వ సన్న్యాస మందక వీలుపడదు
చావుకైనఁ దెగింపక జతన పడదు. ౨౩

పాపము పిన్ననాఁడు తమ భావములం దొక నందనంబు నా
దాపున వైజయంత మఁటఁ దన్పు సరోవర మా సరస్తటిన్
గాఁపుర ముంటకై గలుఁగన్న యభాగ్యుల మధ్య దుర్విధి
ప్రాపిత దుఃఖసాగర మపారముగా రొద సేయు మాటికిన్ !

తీయని వేళ నాటుకొని దిక్కులు ప్రాఁకిన ప్రేమవల్లికన్
గోయు నికృష్టురాలికొఱకు న్నరకంబు సృజింప నేర్పు మా
తోయజసూతి కున్నదని తోఁపదు గాని నిరర్థకంబుగాఁ
బాయునె పాపముల్ ప్రణయబంధము లూడ్చిన పాపజాతికిన్.

మాయని తెప్పలం దొదిగి ముచ్చటలాడు కపోష్ణ బాష్పముల్
సాయములైన పూర్వులకు సన్నని వాతెర తీరుతీయముల్
మాయములైన వాహృదయమర్మములప్రియపూర్వకంబుగాఁ
బాయలుపాయలై తెరలఁ బాఱినవా మృదులాంగకంబులన్

ఎదుటఁ దేజః ప్రపంచ మొం డెసక మెసఁగి
రేక లుండ్రకములు చెలరేఁగఁ దొడఁగె
వాని నన్నిఁటిఁ బ్రియుని రూపమునఁ దిగిచి
నిశ్చల ధ్యాన దృష్టిలో నిలుపుకొనియె. ౨౭

చూపు లోలగించి సురిఁగిపోయిన రూపు
భావ వీధిఁ జిక్కఁబట్టఁ దివురు
భావ సీమ దాఁటి పరువెత్తఁ దలకొన్న
ఊహ సేసి తనియ నుద్యమించు. ౨౮

జాలిగుండియలో మధుకీల వొడమి
అంగకమ్మున సంతాప మతిశయిల్లెఁ
జిత్తము ద్రవించి యార్ప యోచించెఁ గాని
ఊర్పుగాడ్పులు ప్రకృతి నుద్భ్రాంత లూఁచె. ౨౯

ప్రణయ కుసుమంబు రే వగల్ పరిమళించి
తలఁపు లెగఁబోయఁ బ్రియునిపై వలపుఁగొన్న
ప్రేమజీవికి విశ్రాంతి భిక్షవెట్టు
నిద్రకుం గూడ దయ దప్పె నేఁటిరాత్రి. 30

ఆ లలితాంగి ముగ్ధహృదయ మ్మెటు లవ్వలి దివ్వె నిల్వసన్
గ్రాలెఁ దదీయ మైత్రికిఁ గరంగిన దందలి స్నేహపూర మా
జాలిచరిత్రకంధతమసంబును వెల్వెలఁ బాఱినట్లు న
ల్మూలలఁ దెల్విసేరెనిఁక మోదమొ? ఖేదమొ? ముద్దరాలికిన్

# ప్రేమాలోకము



## పంచమజ్యోతి

కొన్నినాళ్లాత్మశాంతి చేకూరకున్న
మౌనముద్ర వహించిన మీనమాంబ
ఆధియో? వ్యాధియో? తుద కన్నియెడలఁ
జేతికిం దాఁటిపోయిన స్థితికివచ్చె. ౧

'ఏరు' వినిచిరో? శాంతాకుమారి పెండ్లి
కొలుకులందేఁటఁ గన్నీరు గ్రుక్కుకొనుచు
జీవములు చేరఁగుక్కిలోఁ జేదుకొనుచు
ఆత్మదౌర్భాగ్యమున కిట్టు లంగలార్చె. ౨

జీవనార్థము పరులఁ యాచించు కంటెఁ
జేదు మ్రింగుటె యన్నిఁట శ్రేష్ఠమగును
పరులచే నభిమానమ్ము దొరఁగుకంటెఁ
గత్తిపైఁ గూలు టెంతయో గౌరవంబు. ౩

ఉన్నరావమ్మ! పోవమ్మ! పిన్ని యనుట
దయకు మాలినవారు బాంధవులు నేఁడు.
పేదలై స్రుక్కునాఁడు గంపెఁడు బలంగ
మెందుఁ గనరాదు శాత్రవుఁడేని మేలు. ౪

కోడితో మేలుకొని ప్రొద్దు గ్రుంకుదనుకఁ
బాడు పొట్టకుఁ బలుపాట్లు పడినఁగాని
తుదకు నేగంజి గట్రియో దొరుకు టరిది
కటికి యుపవాసముల నిల్లు గడపవలసె. ౫

పక్షులను నింగిఁ బాలించుప్రభువు గలఁడు
కప్పలను ఱాతిలోఁ బెంచు ఘనుఁడు గలఁడు
చీమలను బుట్టలో సాఁకు స్వామి గలఁడు
గాని సుంతైన నాపాలఁ గలఁడో? లేఁడో? ౬

భోగభాగ్యము లిడి సానుభూతి నెఱపి
ఉన్నతస్థితి గల్పింపకున్న మానె
కట్ట గుడ్డయుఁ దినుటకుఁ బొట్టకింత
తాను దయసేయరాదొకో? దయదలిర్ప. ౭

భాగ్యవంతులు నూతన పదవులంది
కట్నములఁ గానుకలఁ దగు గౌరవముల
లాంఛనస్ఫూర్తితోఁ బిల్లలకును మనువు
లరయుచున్నారు నాతండ్రి కరయుటెపుడో! ౮

పిల్లకై పోవ సొమ్మెంత వెట్టఁగలరు?
చక్కఁగా రాకపోకలు జరుపఁగలరె?
భూమి బుట్రలు నేమాత్ర మేమి యనుచుఁ
జూతుమను నాంక్షలే చెవి సోఁకుచుండు. ౯

పేమాలోకము

అన్న చేఁజేత విషమిచ్చునం చెఱుంగఁ
గట్టుకొని పోవు మానవుల్ గానఁబడరు
ఉన్న లేకున్నఁ దినెడి దాయన్న మొకఁడె
ఎందు కీ దృష్టిభేదమో యెఱుకపడదు. ౧౦

'ఆజు బాజు'ల నరికట్టె రాలు మగఁడు
పట్టుతో నరయువారు గన్పట్టరెందుఁ
గొడుకును దలంపఁ గంటికిఁ గూర్కు రాదు.
దైవ మేదారి చూపునో? తండ్రి కింక. ౧౧

క్రించుఁదనమున విత్త మార్జింపఁబోఁడు
పరుల మోచేతి నీరు చేఁబట్టఁ జనఁడు
కాయ కష్టము సజ్జన గౌరవ మను
ఏమి పుణ్యమొ? లభియించె నిట్టి కొడుకు. ౧౨

చుక్క పొడువక మున్నుండె ప్రక్కఁ బాసి
కృషికి నేఁగును బరుల నికృష్టసేవ
ఎముక లఱిగెను రాతిరి సమయమందుఁ
గాళ్ళు కుప్పలువడి వచ్చుఁగాదె విసిగి. ౧౩

పెండ్లి యను మాటయే తలపెట్టనీఁడు
ఈ ఘటము రాలిపోవ నిం కెవరు దిక్కు
పాఱగతు లున్నవనుకొందుఁ బక్షికైన
నావరాలయ్య కెయ్యెడఁ దావె లేదు. ౧౪

పచ్చని కాఁపురం బడవిపాలయి పోయిన నాఁటినుండి నా
ముచ్చటలెల్లముక్కలయిపోయినఁగొంతకుఁ గొంతయన్న తా
విచ్చియుఁగూడ నాడికలకే గుఱియయ్యె సుతుండు బెంగచేఁ
జచ్చెడిఁగట్టెనే? కడుపుఁ జించినఁ గాళ్ళపయింబడుంగదా!

అమ్మకు నబ్బకున్ వెఱచియా? పగవైతివి వెఱ్ఱి తల్లి శాం
తమ్మ, నినుం గుఱించియ కదా? పలుబాముల కగ్గమైసదా
చెమ్మటఁ బిండితిన్ దుడుకుఁ జేసిన కష్టము వ్యర్థమయ్యెఁ బో
నిమ్మ పరాత్పరుండు కరుణింపక పౌరుషముల్ ఫలించునా?

కన్నులఁగన్న నాకె మమకారము గీఱదుగాని సర్వ సం
పన్నుల కేమితల్లి! యెటుఁ బడ్డఁ బులుల్ పులులే కదా? మత్తే
మన్నను దిక్కుమొక్కు గలదా! గతిమాలిన నాకుఁ జావురా
కున్నది వాఁడు కన్దెఱవకుండె దరిద్రుల కట్టి భాగ్యమా?

ఏలెడువారు మీరు మది కెక్కఁ జరించెడువార మేము మీ
వీలగునట్లు వోయెదరు వేడుకచోట్లకు నేను గాదనన్
బోలునె! నాకునై చుణిఁగిపోవక పల్కిన నోటిముత్తెముల్
రాలునె? ఎంతవారికి బరంబయిపోతి నదేమి కర్మమో? ౧౮

నాయెడ బెంగగూరితి వనన్ వినినంతన గుండె బ్రద్దలై
పోయిన దింతమాత్రముమముం గరుణించినఁ జాలుఁగుక్కలో
హాయిగఁగన్నుమూతుఁ గొడుకై నది కానిదెఱుంగఁడండలా
పోయిన విట్టిచో బ్రదుకఁబోలునె? గర్భదరిద్రురాలికిన్. ౧౯

బాంధవ మొక్కఁ డేమి యెటువైపునుజూచిన నెంతొ రక్తసం
బంధముకద్దు త్రెంపుకొను వారల కాకడజాతివాఁడునున్
బంధువుగాకయున్నె? ధనవంతులు వేసెడు వేషముల్ కళా
బంధురముల్ దరిద్రుల ప్రవర్తన లెంతొ కళావిహీనముల్.

అన్ననిమిత్తమాత్రుఁ డగు నన్నిఁటికిన్ వదినమ్మకద్దు నా
కన్నదినంబు లెన్నిగల వమ్మ? నిజంబుగ నీతలంచిన
ట్లెన్నఁడు గాకమాన దొకఁ డేమిటి నీపదసేవలో రవం
తన్నఁ బరాత్పరుం గొలిచినట్లయినన్ దరిఁ జేర్చకుండునా!

పిడువ ముడువ నాల్గంగులు
గడిదేఱిన దాన వెవరి గతు లెట్లగునో?
పుడమి తలక్రిందొనర్చియుఁ
బడిమాఱక తుదకుఁ గడచి బ్రదికిన దెవరే? ౨౨

చెలికాలిబలపమై న
వ్వులపాలై పోయెనన్న పోని మ్మతఁడే!
శిలఁగొట్టుకొని వసుంధరఁ
గలకాలము నిల్చుఁగాక కడు ధన్యండై. ౨౩

అని కన్నులద్దుకొని శో
షను మాగన్వొట్టి చెంత శయనించిన పు
త్రుని బిల్వ నోరు రాకయుఁ
బనవెన్ లోలోన స్వప్న భయకంపితయై. ౨౪

ఆలోనట్టవనుండి ఘూత్కృత మసహ్యంబై విషోగ్రానల
జ్వాలాజాల జటాలమై నిగుడ సాటోపాత్తకాలపాశంబు నా
వ్రేలుం గాలభుజంగి పైనఁ బడఁగా వీక్షించి ముక్తీశ్వరుం
'డీలా'గై కొనవచ్చెనా!యనితమాయించెన్ బ్రశాంతంబుగన్

తన వాలాగ్రము నూఁదిపట్టు భుజగేంద్రస్వామినిన్ హెచ్చరిం
చిన కన్నుంగవ తెప్పలార్పక చెమర్చెన్ బాఁపపూఁబోణిబు
స్సని మూఁచూచి తదీయపుత్రకుని సెజ్జం జేర నుంకించునం
తనఘోషించుచుమాతృగర్భమువిదీర్ణంబయ్యెనోకుక్కమ్మడిన్

నాపాపం బిఁటు బిడ్డపైమఱలెనా! నాపుణ్యపాపంబులన్
రూపింపం దొరఁకొన్న విశ్వగురుఁ డీరూపానఁ బ్రచ్ఛన్నుఁడై
నాపట్టిం దెగటార్పఁజూచుటదియన్యాయ్యంబుసమ్మించుఁ దా
నాపాముం బెనవైచి పట్టెనది బాహాశక్తి దీపింపఁగన్. ౨౭

ఆనాగేంద్రము వ్రేటువడ్డగతి దీవ్యద్రత్నదీపాంకుర
స్థానానూనఫణాఘృణుల్ మెఱయ ఘూత్కారమ్ముతోరమ్ముగా
మీనాంబాకరయుగ్మముం గమిచి కుమ్మెల్లోవఁగాటందెడ
తూన్నుండంతట మేలుకాంచి కనెఁద్రాఁచుం దల్లినల్లంతటన్.

చేపట్టున్ సడలించుకొన్న భుజగీశ్రేష్ఠం బమాంతంబుగాఁ
గోపాటోపముమై నటింపఁ దొడఁగెన్ ఘుక్కారవం బేర్పడన్
బైపంచెన్ దిగవైచి పట్టెఁదుదకాపద్మయ్య కోపాగ్ని సం
తాపోద్దీపితుఁడై పటాపటరటద్దంత ప్రభగ్నంబుగన్. ౨౮

పట్టి గుంజ్రాతఁ జితుకం
గొట్టి విడిచె మీనమాంబ గుండెలు బరువై
పట్టెఁడు నుర్వులు గ్రక్కుచుఁ
జుట్టులు దిరిగెన్ సుతుండు శోకింపంగన్. ౩౦

చుట్టుంబట్టులు ప్రోవై
'అట్టెటె!' యోయమ్మ, మీన మక్కను బుర్వన్
ముట్టెనఁటె యెంతపాపము
గట్టెగొనెన్ దానికడుపు గాలన్ ప్రీలన్. ౩౧

ఆనె త్తిగొడుగు దొలఁగినఁ
గానిమ్మని నడుము నాయఁగట్టినదమ్మా!
పోని మ్మ న్నోకఁ డుండియు
లేనట్లై యీమె బ్రదుకు లేబరమయ్యెన్. ౩౨

ఆయిల్లా లాపెన్మిటి
పోయినది "సుతా" మఱొక్క పొరుగుగడపకున్
బోయి యెఱుంగదు దైవము
సాయపడకపోయెఁ గష్టసమయములందున్. ౩౩

నోరారఁ బల్కరించుచు
గారాబముసేయు లేని కాఁపురమైనన్
గారాకూరము లెఱుఁగదు
ఆఱళ్ళైపోయెఁ గడకు నన్నకతమునన్. ౩౪

ఇంత తగులఁబడ్డదిగద!
శాంతను ముడివెట్టి యిల్లు జరుగుట కితనికి
జెంతకుఁ దీసిన లోకము
సంతసపడు రాయఁ డెంత ఛండాలుండే! ౩౫

వదినె గయ్యాళిగంపయ్యె పాఱఁబట్టు
దొడ్డ యిల్లాలు గావునఁ దొణఁక లేదు
నీవు నేనైనచో దాని నిగ్గుఁదీసి
మలపకుందుమె శంకరమాన్యములకు. ౩౬

చెడి బ్రదికినట్టి తొత్తుక
గడిదేఱిన మాత్ర రాణిగాఁగలదమ్మా?
ఇదుముఱువడి తొడుగఱయె
పడిమాఱిన బ్రదికి చెడిన 'బాపతు' వేరే! ౩౭

ఆరవ్వంత కొఱంతయుఁ
దీఱినఁ బద్మయ్యపట్ల దిగులన్నది లే
కేరోజు వాఁడు రమ్మన
ఆరోజే పయనమగుదు నని మఱపిల్లున్. ౩౮

పామనియో? గామనియో?
ఈ మాదిరి సంహరించునేఁగాని పరం
ధాముఁడు తనపై నేరం
బే మాత్రము మోపికొనఁడు హింసారతుఁడై. ౩౯

మన్నన మన్నం గలియున్
ఖిన్నత ఫలమేమి ? గడ్డిగింజల బత్తెం
బున్న వలె కంతకుండును
గన్నెత్తం దలంకు నవలం గాదనం గలరే ? ౭౦

అని తలకొకతీరాడుచుం
బనవిరి లోలోన దుఃఖబాష్పము లురులన్
జనవాక్యము కర్తవ్యము
మునుపడంబో రొరులకొంప ముంచినవారల్. ౭౧

ప్రొద్దెక్కుకొలంది దేహము
ముద్దయి తికమకలుపుట్టి ముడుగంబాఱన్
అద్దద్ది బైటకు నొక
రిద్దరు చేంజేతం దెచ్చి రీలోంగడనే. ౭౨

చూరుల బారులు తీఱెను
నారాయణ ! దిక్కులేని నరుల నిటువలెన్
గారించు చుండు వేరిన్
బూరాపడనీయ వెంత పుణ్యాత్ముండవో ౭౩



# ప్రేమాలోకము

# షష్ఠజ్యోతి

కోరిన యల్లుఁడా దొరకె, గుమ్మకు రొట్టెగఁ జెండఁ శేర సం
సారము ద్రవ్వి పెట్టి రది చాలక యుండిన నప్పుసప్పులా
దోరిచి పట్టి రింత కెటు దోఁచకయుండిన మంది కొంపలా
ఆఱిపి రింత కన్నిఁట సమర్థులు కల్గర పుణ్యాదంపతుల్. ౧

కాలము మాఱిపోయినది కట్నము పేరఁటి యేదు వేల్పదా
ర్వేలయి భూమిబుట్రలును వేలముపాలయిపోయెఁ బోఁగ న
య్యాలిపరమ్ము తాట దగు లంతయు నెన్మిదివంద లున్నఁజి
ట్టాలకుఁ జాలలే దిఁక బడాయి యడంగిన దంత కంతకున్.

కొయ్యలమారి యల్లునకుఁ గూఁతునకు న్సరిలేక హానితోఁ
గయ్యము పెట్టుకోవలసెఁ గష్టదినంబుల నాదుకొన్న వా
రెయ్యెడ లేరు నేఁటి కొనరించిన పాపము పండె వెత్తి పా
పయ్యకు మన్ను మిన్ను గనుపట్టెనె చుట్టము పక్కమున్నచో.

అల్లుఁడు తోడఁబుట్టు వనయమ్మర లేక శ్రమించినన్ని నా
ళ్ళిల్లని పట్టకే గులకరించె న దెక్కడి పిచ్చిడబ్బొకో
కొల్లగ వచ్చిపడ్డ దిటు కొమ్ములు మొల్చిన వీరి ముందు నా
చెల్లెలు వడ్డ కష్టములు చెప్ప తరం బగునా? నిజంబుగన్. ౪

ప్రేమాలోకము

ఆయమ తెల్లవార్చుకొనె నంతకుమునుం దిటులైన నెంత వా
పోయెడిదో తదాత్మజుఁడు పుట్టెఁడుదుఃఖములో మునింగినన్
రాయఁడువోయి నాయని పరామరిసించినవాఁడు గాఁడు నా
రాయణ నాఁడు ఱాలును గరంగిన వీతని యేడ్పువెల్లునన్.

అందఱు వోవువారె యెవరైనఁ దిరంబుగఁ దిష్టవైచి కూ
ర్చుందురె ముందు వెన్క లనుచుందు రెటైనను గన్నతల్లి కే
బందువుసాటి రాఁడయినఁ బాపమొ పుణ్యమొ బంధుమిత్రులే
ముందల లొగ్గినన్ భువనముల్ దలక్రిందగుఁగాక నొత్తురా.

మాతృప్రేమకు నగ్గమై పసవు పద్మనాయఁ డేకాకియై
బీతుంగూరియుఁ గొన్నినాళులు మనోవిభ్రాంతితోఁ గొన్నినా
ళ్లే తెన్నుం బొడఁగాన కెందును నిబాయింపంగ లే కెవ్వనో
చేతంబట్టినఁ గొన్నినాళ్లు గడపెన్ జింతాకులస్వాంతుఁడై. ౭

కలకాలమ్మొకరీతి నిల్వదు మహా
కల్పంబులే గిట్టునన్
దలక్రిందైన మనుష్య మాతృలకు ని
త్యం బేది ? రాయం డిటీ
వల మేనల్లుని జేరఁ జీరి తన పా
పం బెల్ల వాక్రుచ్చి క
న్నుల నీర్వెట్టె నిజమ్ముగా స్వకుల బం
ధుత్వంబు సామాన్యమా ? ౮

ఆకొండ కీకొండ డీకొల్పు మొనగాఁడు
కొండమ కొండయి మధ్యఁ గూలినాఁడు
ఆయూరి కీయూరి కలికించు చలపాది
పాలేరుగా మధ్యఁ జీలినాఁడు
ఆయింటి కీయింటి కంటించు మొనగత్తె
నడిమింటి కంబమై నుడిసికొనియె
ఆ గొంది కీ గొంది కల్లువెట్టెడు తల్లి
పెనుగొందియై యడ్డువెట్టుకొనియె
ఒరుల నెత్తురు ద్రావు ముష్కరుఁడు భర్త
చంకలను బిడ్డ లూడ్చెడు జాణ భార్య
కాలవశమునఁ బద్మయ్య కాళ్ళ కడకుఁ
జిట్టచివరకు విధిలేక చేరినారు. ౯

అతని తెక్కల కష్టార్థ మనుభవించు
ఈ పిశాచములకు దుఃఖ మెక్కడయ్యె
ఇంబుఁ దొరఁగిన జీవచ్ఛవంబు లన్ని
పరుల కష్టార్జితం బాసపడును చెడును. ౧౦

ప్రతిఫలాపేక్ష దక్కి నిరంతరంబు
తేరకుం దేర మేపెడు వారి ధనము
క్రిమము దప్పక జన్మాంతరమున యందు
గాడిదై బూడిదై తీర్పఁగలఁడు నరుఁడు. ౧౧

వారి వెచ్చని కన్నీటి ధార లందు
అనుపదంబునఁ బ్రేమ ప్రత్యక్ష మయ్యెఁ
జిత్త సంస్కార మొదవిన జీవి కెపుడు
విశ్వకల్యాణపథము లభించి తీరు. ౧౨

ఆత్మసేవ జీవికార్థంబు గావచ్చుఁ
బారలౌక్యమునకు భంజకంబు
పరులసేవ సుంత పరమాత్మసేవగాఁ
బరిగణించువాఁడె పంచజనుఁడు. ౧౩

మానధనప్రాణము ల
జ్ఞానులు వాటించుచుంద్రు సత్యాగ్రహులా
మానవుఁడే మాధవుఁడని
ప్రాణము లర్పింతు రస్మదాదుల కగునే! ౧౪

కడ కానాయఁడు దేశబాంధవుని శంఖధ్వానమాలించి ముం
దడుగై నిల్చినఁ బల్లెసాంతమొక కట్టై గ్రంథభాండారముల్
వడుకుంగుడ్డలు వీదిబళ్ళు పలుచోట్లన్ రాట్నముల్ పెళ్ళనన్
నడపింపం దనపేరుమ్రోఁగినది పల్నాడెల్ల నొక్కుమ్మడిన్.

గ్రామసౌభాగ్యసంఘంబు లుత్థాపింప
లుగ చెడ్డజనులకాలోటు దీఱె
పంచాయతుల నొక్కపట్టున నడపింప
ఇంటిగుట్టు రచ్చ కెక్కు టుడిగె

గుత్తజట్టీక్రిందఁ గొనుగోలు పచరింపఁ
జిల్లర బేరమా మల్లఁబడియె
ముడివస్తు వినిమయం బెడనెడఁ గల్పింప
కులవృత్తులా కన్ను మలుపకుండె
పండ్లు పులిసినవాచుట్టుపట్టులకును
కనులు గుట్టిన వాపెద్ద కాఁపులకును
ఒడలు మండిన దాయూరి బడుగులకును
కేవల మ్మొక్క పద్మయ్య సేవకతన. ౧౬

గడ్డు దేలిన యడ్డాల గడ్డలోని
కుంకలు బడాయి బండలఁ గొల్వుదీర్చి
గుప్పకోల్గొని లోలోన నవ్వుకొన్న
ఇంచుకంతయు నతఁడు పట్టించుకొనఁడు. ౧౭

మునుము పట్లముందు మ్రొగ్గనినాపలు
నోరి త్రుప్పుడుల్ల దూరుచుండ్రు
బైటఁబడిన వారి బ్రతుకు బండారంబు
కడిగి కాకితాలఁ గట్టఁ గలరు. ౧౮

బండపిండయి పిట్టపడిచచ్చు నెండలోఁ
గాళ్లు బొబ్బలువోవ 'ఖాది' మోసి
పల్లెపల్లెను దేశ పరతంత్రతం గూర్చి
అలఁత వుట్టఁగ నుపన్యాసమిచ్చి

అస్పృశ్యతాదోష మడుగంటి పోవఁగాఁ
గొంక కెల్లెడఁ 'జాపకూడదు' గుడిచి
స్త్రీ విద్య జాతికిన్ జీవగఱ్ఱని సదా
వీలగు చోటెల్ల విద్యగఱపి
పూర్వభారత వైభవ స్ఫూర్తిఁ దలఁచి
సారెసారెకు వేఁడి కన్నీరు గురిసి
కులమత ద్వేషముల పట్ల గుండె దఱిగి
ఆసలన్నియు మాని సన్యాసి యయ్యె. ౧౯

ఆమోద మొలికించు ప్రేమామృతంబులోఁ
గాలకూట విషంబు గలిపినాఁడు
తలదాఁచుకొను కన్నతల్లి యంకంబును
జిక్కని చితిపాలు సేసినాఁడు
విడిచి పుచ్చిన వయోవృద్ధ దంపతులను
గదలకుండఁగ నంటఁగట్టినాఁడు
గుండెలు గూలార్చు కూటి పేదఱికంబు
నిలువెల్లఁ దొడవుగా నింపినాఁడు
పలుచఁదన మేమి? పాపాల భైరవునకు
ధర్మపథ మేమి? యామాలదైవమునకు
దిర్దిరం గాలచక్రంబు ద్రిప్పి త్రిప్పి
కడకుఁ బద్మయ్య మెడపైకి విడిచినాఁడు. ౨౦

ఎన్ని యవాంతరంబు లెదిరించిన నీ ముదుసళ్లమూలమై
బన్నము లెన్ని గల్గిన రవంత చలింపక దేశసేవపైఁ
గన్నిడి యున్నెడం గఱవుకాలము దాపురమయ్యె సర్వ సం
పన్నుల కప్పుడే తెలియవచ్చిన దిక్కటులన్న నేమిటో? ౧౧

జల వట్టువడిన బావులు
పిలిచినఁ బల్కవు రవంత పీడించినచో
గిలకల నెపమున మొరయున్
ఫల ముండునె? నీరసులను బాధించినచో. ౧౨

తీయఁ బెట్ట కుండి తెగమూల్గు పాఁతఱల్
దిక్కుమొక్కు లేని ముక్క డబ్బు
తూరుపాఱఁబట్టి రేరోజు కా రోజు
వాఁడు కన్నుఁ దెఱచినాఁడు గాఁడు. ౧౩

గొడ్డు గోద కట్టుఁగొయ్య లందు గోటారె
బంటు పైద మూలఁ బడియెఁ జెడియె
ఆధివెట్టి రున్న యాస్తిపాస్తులు గూడఁ
బొడిచి తెచ్చి రప్పు పుట్టు దనుక. ౧౪

బందిపోటు సాగి ప్రతి గ్రామమున యందుఁ
బచ్చియున్న వారి పంజ వట్టె
దొడ్డవోవకున్న దొరయిల్లు కనరాదు
సాగఁదీయకున్న భోగి లేఁడు. ౧౫

దొల్ల లూడ్చి తిన్న డొక్కలకలవయ్యెఁ
బల్లెనాటి సీమ ప్రజల కపుడు
బ్రదికి చెడ్డ దొడ్డ రతనాలగడ్డకుఁ
దిరుగు మఱుఁగు లేని దెబ్బ దగిలె. ౨౬

బ్రహ్మనాయని మత దీక్ష పరిఢవిల్లి
బాలచంద్రుని శౌర్యాగ్ని ప్రజ్వరిల్లి
అన్న పెద్దన్న పౌరుష మత్తమిల్లి
ఈ మహాభూము లందె జీర్ణించి పోయె. ౨౭

నలగాముం డిటఁ గొల్వుదీర్చునపు డా నాగమ్మ వీరాంక ము
ద్రలు సెక్కించెడు వేళ మన్నెదొర లాస్థానంబులోఁ బైఁడి కా
న్కలు గుప్పించెడు వేళ మ్రోఁగినవి భాండారమ్ములిచ్చోట ని
చ్చలు వీరోచిత దానధర్మకలనా సౌజన్యధన్యంబులై. ౨౮

ఖలనా డన్నను దిగ్దిగంతములు సంభావించు వీరాగ్రణుల్
కలరా? యన్న సమస్య కిచ్చటఁ బరిష్కారమ్ముగన్ విచ్చుక
త్తుల మైకమ్ముడివోవనాఁడు విపులాంధ్రుల్ చల్లురక్తాక్షతల్
తలపైఁ జిందినఁ గుఱ్ఱవీరవరగాథల్ ద్రవ్వి రిచ్చోటనే. ౨౯

సారె కా వీరకంకాళ సమితిమీఁద
నడిచి వచ్చిన చల్లని నాగులేరు
జీవనం బిడి సాఁకిన "జీవగడ్డ"
అంతకంతకు దుస్థితి కగ్గమైన. ౩౦

నాఁటి పరిస్థితుల్ దలఁచు నాయని గుండెలు వ్రీలి వేఁడిక
న్నీటఁ గరంగె వాఁడు కరుణింపక కాటకపాటకంబు లే
నాఁటికిఁ దీఱ వచ్చుటి జనంబులఁ గొందఱు పిల్లజెల్ల జం
జాటము వెంటరా వలససాగిరి స్వోదర పోషణార్థమై. 3౧

కఱవుం గూరిన వారి పోషణముకై గ్రామైకరాత్రంబుగన్
దిరిగె న్నాయఁడు ధర్మకార్యపరు లాదేశస్థు లున్నంతలో
సరకో?సంబళమో?తృణంబో?పణమో చందాలు వేయించి వే
సిరి తన్మూలకమౌ ధనంబు దనియించెన్ గొంతకుం గొంతమై.

పొల్లో? పొలకట్టో? ముట్టినఁ బొగడినారు
తృణము, పణమైన ముట్టక తెగడినారు
సృష్టిచేసిన యమ్మహాస్రష్టకైన
మచ్చ గల్పింపకుందురా? మానవుండు. 33

త్రవ్వి తలకెత్తినన్నాళ్ళు దాతయంద్రు
లాభముం గోరినన్నాళ్లు లోభియంద్రు
పంచద్రొక్కిన మూనాళ్లు బంధువంద్రు
కావునన్ దైవమీరీతిఁ గన్నుదెఱచు. 3౪

అంగిట ముల్లై గ్రుక్కలు
మ్రింగెదు ప్రజ కాటుపోటు మెండై యుండన్
బంగారుబా బెవండో?
ఇంగలము దవిల్చె రాయనింటి వెలిసెకున్. 3౫

పడమటి "సాంబ్రము" తఱచై
పడగాడ్పులు కసరి విసర వఱువట్లకుఁ దో
డెడపెడ సుడిసిన చిచ్చిఁకఁ
గడుపే కైలాస మనుచుఁ గవియంబడియెన్. ౩౬

ఇల్లని యిల్లాలని పసి
పిల్లండని పల్లె ప్రజలు బీతుగుడుచుచున్
గొల్లున నేడ్చిరి మంటలు
చల్లారక చుట్టుముట్టె క్షణకాలములో. ౩౭

నాదాటి యున్న గొడ్డుం
గోదలు మలమలనిమాడెఁ గొట్టంబులలో
గాదెలు, గంపలు, కొంపలు
సోదెకురాకుండ సుడిసి చుట్టలు దిరిగెన్. ౩౮

నీళ్లెద్దడి కాఁగాఁ బర
గళ్లకుఁ గాల్సేతు లాడఁగలవా ? వెలిగా
గోళ్ళుం గిల్లుచుఁ జూచిరి
పెళ్ళున నూరేగు నగ్ని బీభత్సంబున్. ౩౯

గుప్పు గుప్పున మంట లుప్పరంబున యందుఁ
బొగమబ్బు లాపోవఁ బుక్కిలించె
విస్ఫులింగంబు లావిరి గాడుపున యందుఁ
జిక్కని వేంద్రంబు చిలుకరించె

నిప్పుతెప్పలు పూరి చప్పరంబుల యందు
ధగ ధగ మెఱుఁగెక్కి తాండవించె
విస్తృతజ్వాల లావీది గుమ్మములందుఁ
జకచక ద్యుతుల నాలుకలు గోడెఁ

గాకిగోలయి దిక్కామొగంబు లగుచుఁ
గంచె కొకఁడయ్యె నయ్యారి పంచజనులు
ప్రళయ భైరవ నృత్యంబు సలిపి సలిపి
అగ్ని భట్టారకుండు చల్లారెఁ దుదకు. ౪౦

రాయఁడు గోలుగోలుమని ఱాల్గరఁగన్ విలపింప మూఁగుచా
చాయలవారి దేమని విచారము సేసినఁ గొంపమున్గెరా!
నాయన! యెంత పాపపుదినంబులు దాపురమయ్యె సొమ్ముకై
పోయిన దింటిలోన కయిపోయిన దేమనుకొన్న నేమగున్.

పోయిన పోకఁ బద్మా
నాయఁడు రాఁడయ్యె నింక నాయనువారి
కాయమునకు లేరుగదా ?
నాయగచా క్లేవిధాన నడువంగలవో ! ౪౨

కొలఁకున హంసలవలె నొక
తలఁపున విహరించి నేఁడు దైవోపహతిన్
నిలిచిన లోకము లెన్నఁడు
గలుపునో ? పరమేశ్వరుండు కరుణాళుండై. ౪౩

ప్రేమాలోకము

ఈ కట్టెలు రెండొకచో
డాఁ గొల్చినవాఁడె యింత దయదప్పినచో
లోకులు సంబాళింతురె
ఏకడ కాయిర్వురే తరింపఁగ వలయున్. ౪౪

ఎంత తపించితిమో భగ
వంతునకే యెఱుక పంచప్రాణంబులు మా
శాంత పయి నిల్పుకొంటిమి
పంతము నెఱవేర్చుకొనియెఁ బరమాత్ముండున్. ౪౫

ఆమరణము పగ లందురు
ఈ మాదిరి యల్లుగుట్టుఁ డిలలోఁ గలఁడా?
పాములతో స్వాములతో
జామాతల తోడి పొత్తు చన దెవ్వరికిన్. ౪౬

తాళింగట్టిన నెపమున
'శాళీ' లోఁ బెట్టవచ్చు నాపదలందుఁ
ఆలన పాలన సేయని
బాలిశులకు బంధుమిత్ర భావము గలదే? ౪౭

కడుపారఁ గన్నతల్లిని
గడ కొకమారైనఁ జూడఁగలవో? లేవో?
కడు బేలవమ్మ శాంతా!
మిడిమేలఁపు మగని నెట్లు మెప్పించితివో! ౪౮

అని పనవునాయనిం గని
కనికర మొదఁగదుర నింతగా వగచినచోఁ
బని చెడి పోయెదు లెమ్మని
అనునయ వాక్యములు వలికి రచటి జనమ్ముల్. ౮౯

పరమశివా! యని కొందఱు
హరిహరి! యని కొంద అప్పుడప్పుడ శవసం
స్మరణ మొనర్చిరి పలువురు
దొరఁకొన్న న్నరకమైన దుస్తరమగునే? ౯౦

నాయం హాముని మాపునం బఱిగ ధాన్యంబుక్కు డాల్వట్టి తేఁ
బోయెం జెంగటి పల్లెటూళ్ళ కచటూ పూటుండి మర్నాఁడురా
నీయన్యాయము దాపురించినది దా నీ దృశ్యమీక్షించి వా
పోయెన్ దైవమనర్థకంబు లెసకొల్పున్ గష్టకాలంబునన్.

# ప్రేమాలోకము

## సప్తమజ్యోతి

తొలకరి బిందింపంగాఁ
గలరా వ్యాపించె గ్రామకంఠమునందున్
పలుఁగడ నెత్తిన భీతిం
గొలుపును సాగించి రూరికులపతు లొకఁడై. ౧

చలుదుల్ వెట్టిరి వీరరుద్రపుగడున్ సాగించి రా బియ్యపుం
గొలవోయించిరి కుంభ మెత్తి రరిజోగుంబట్టి రద్దంకిసా
ములుబొద్దంకుల కెత్తిరన్నక్రియఁ గుమ్ముందుమ్ము గానాటు పె
ద్దలుపిన్నల్ గుమిగూడిరొక్కట మొగిముత్యాలమ్మతిర్నాళ్లకున్

పంబలమేళముల్ మొఱటుబై నిడిసుద్దులు, ''వీరత్రాళ్ళు'', కుం
కంబులబండ్లు, గందపొడి, గంగని చిందులు, గాలివిందు లా
డంబర మట్టహాస మొకఁడా? గుడిలోఁ గలగూరగంపయై
సంబర మంబరం బొడిచి శబ్దగుణాశ్రయమయ్యె నయ్యెడన్.

గిలక ల్దాఁకఁ దుఱంగలించు వెలియంగీ దొడ్డి భిక్షాలు కు
చ్చులసెల్లా, వలెవాటు, దండెకడెమున్, సొన్నంపుజల్తారుచుం
గులపాగా కలనేఁత పుట్టము మెఱుంగుల్ చిల్కఁగొల్వయ్యెఁ బూ
వుల తంగండయి దద్దళంపుమునిగోపుంబండ నుద్దండతన్.

తానఁటె ధర్మకర్త! పరదాపురుషుండఁటె! పెద్దకాపఁటే?
ఏనుఁగుపాడి కాఁపురమఁటే తన మాటకు మారులే దఁటే
దానవుఁ డన్న నీతఁడె కదా! బలిజంతు వధార్థమై సభా
స్థాన మలంకరించె నిది ధర్మమె? మానవజన్మ కెన్నఁడున్.

మెడలందట్టెఁడుసొమ్ము కర్ణములకున్ మేల్జాళువాకమ్మలున్
ముడులంబట్టెఁడుపూలు లేనడుములన్ మోపైనయొడ్డాణముల్
కడలంబొత్తు, లొడళ్ళగందములు, చంకంబిడ్డలున్ మోములన్
విడెపుం గెంపులు తాండవింపఁబడఁతుల్ విచ్చేసి రచ్చోటికిన్.

మన భిక్షాలున కిట్టి ఘట్టములె గమ్యస్థానముల్ గన్నులన్
దనుకంజూచు హొయల్బయల్పడ జబర్దస్తీ చెలాయించు నీ
పనికిం బాసిన బాబులే ప్రభువులై పాలించుచున్నారు కి
మ్మనకుండ న్నిఱు పేదపల్లెలను బాహాటమ్ముగా నేఁటికిన్. ౭

పిలు పిలు పాటిపెద్ద నని బిట్టదలింపఁ బదుంద్రువాటి ర
వ్వాలను కతండు గ్రక్కదలి వచ్చి విదిర్చిన నందివాటుగా
నిలిచిన కాఁఱుదున్న గమనించియొడల్ సడలించె నింతలోఁ
గలఁగనినట్టు లచ్చటికి కెకాగొకి వచ్చిన నాయఁ డిట్లనున్

ఏమని ఖడ్గమూని వధియించెద రీదయనీయజీవులన్
బామరులార! దేవతలపై నెపమొడ్డుచు జిహ్వకింపుగా
నామెతలాన నేర్చిన మహాత్ముల కీ చవిగాని పల్కులున్
దామసకారణంబులె కదా? వివదించిన లాభముండునే?

వెచ్చని రక్తమోడ్చి తను విందొనరించిన గ్రామదేవతల్
మెచ్చెదరే? దయాళు రిది మే లది కీడని నచ్చఁ జెప్పరే?
ఇచ్చటఁ జిందు రక్తకణ మీశ్వర సన్నిధినిల్చి దుర్ణయం
బచ్చుపడ న్వచించిన యనంతరమే సరిదాఁకు నన్నియున్.

పశుపక్ష్యాదులకై నఁ బ్రాణభయమున్ స్వాతంత్ర్య సంరక్షణం
బశనాది వ్యసనక్రియల్ తఱచుగా నన్నింటఁ దుల్యంబు లీ
దృశవిజ్ఞాన విహీనకర్మ లనుసంధింపం బ్రయత్నించు తా
దృశులో శ్రేష్ఠులు ముగ్ధజంతుతతులో శ్రేష్ఠంబులూహింపుఁడీ.

పరహింసాత్మకమైన జాతి క్రమశః ప్రభ్రష్టమై తీఱు సం
స్కరణోపస్థితమైన జాతి తుద కుచ్చస్థానముం బొందు ము
ష్కరులీనాఁడు నియంతలైనడుపు రాజ్యాలన్ని చోట్లన్ భయం
కర హింసాప్రతిపాదకమ్ములయి రక్తజ్యోతి వెల్గించెడున్.

రక్తపిపాసతో సకల రాజ్యము లన్య భయంకర స్వయం
శక్తినిజాటుచున్నవి స్వజాతిని మ్రింగి వినాశమొందు న
వ్యక్త మనుష్య చక్రమునయం దనిశంబు పరిభ్రమించు నీ
శక్తికి రక్తపారణ మొసంగు నియంతలు వోక నిల్తురా! ౧౩

మానవులై జనించి తుది మారణయంత్రములై శ్మశాన సం
స్థాన మొనర్చినా రఖిల ధారణి జీవికి జీవి జీవనం
బౌనని ప్రాణికోటి హతమార్చి స్రవించెడు రక్తవాహినిన్
స్నానములాడు నీ నరపిశాచము లెందులకై జనించెనో?

ధర్మదేవత నాల్గుపాదముల నిలిచి
దాయగట్ట కహింసామృతంబు గురియ
"ఆత్మవ త్సర్వభూతాని" యనెడు వెన్న
కాచి వడఁబోయఁడే మన గౌతముండు. ౧౫

జీవకళ లుట్టిపడ్డ "త్రి చీవరముల"
రవ్వ లొలికిన దివ్య "త్రి రత్నములను"
శంక లుడిపిన "చతు రార్యసత్యములను"
జాలువాఱిన దపు డహింసా స్రవంతి. ౧౬

బింబిసారునికొల్వు స్థంభించిపోవ
జీవకారుణ్యవృష్టి వర్షించినపుడు
దశదిశల్ పుల్కరింప నాధర్మరాజు
బ్రహ్మరథ మొక్క పెట్టునఁ బఱవ లేదె? ౧౭

ప్రథమ సంగీతి నెలకొల్పఁబడిననాఁడు
పునుక పేరులు దాల్చిన భూతధాత్రి
రాజగృహమునఁ గైకొన్న ప్రబలదీక్ష
భంగపఱచిరి తమవంటి ప్రభువులెల్ల. ౧౮

ధర్మ విప్లవ మొదవిన తత్‌క్షణంబ
అవతరించునఁటే పరమాత్ముఁడెందో!
తడవ నేటికిఁ బ్రత్యక్షదైవతంబు
గాంధిదేవుఁడె మాఱట గౌతముండు. ౧౯

ప్రేమాలోకము

స్వాతంత్ర్యమో యహింసా మంత్రమో కాని
తన శంఖరావ మర్థంబుగాదు
సత్యాగ్రహంబో విషయనిగ్రహమొ కాని
తనసన్న్యసన మిట్టి దనఁగ రాదు
ఆత్మసాధనమొ దేశారాధనమొ కాని
తనకార్యదీక్ష కంతంబులేదు
మనపాలనమొ హరిజనసేవనమొ కాని
తనభక్తిశ్రద్ధ లొక్కనికి లేవు
నీతి నియమము గల గోఁచిపాతరాయఁ
డాత్మనిధనము లెక్కసేయని తపస్వి
ప్రధన మెఱుఁగని స్వాతంత్ర్య రథముమీఁదఁ
జక్కొలిపినాఁడు నేఁ డహింసాధ్వజంబు. ౧౦

కనకగర్భంబు చెడ గొఱిస్సి కలఁచి రంచు
దాస్యబంధాల నురిదీయఁ దలఁచి రంచు
గుండె పిండయిపోఁ గొల్లఁ గొట్టి రంచు
రచ్చ కెక్కె దరిద్రనారాయణుండు. ౧౧

ఒక్క నెత్తురు బొట్టున కుర్విలోన
నన్ని దౌర్జన్యములు మొలకెత్తఁ గలవొ
ధర్మమే జయమను నార్షతత్త్వ మిట్టి
దివ్యఋషి వాక్కులందె ప్రతిధ్వనించు. ౧౨

తనువు దబుగులై హింస కర్థంబు గాదు
మానసిక బాధ సైతము మరణ సమమె
పరుల హింసించు రాక్షసప్రభువులకును
ఆత్మపరిశోధనం బెన్నఁడైనఁ గలదె? ౧౩

అనిగుంపుం దలఁగించి నాయఁడు వృథావ్యాపాదనోత్సాహులౌ
మొనగాండ్రం బతిమాలి కాసరము పై ముంజేతులన్ మోపిని
ల్చిన భిక్షా 'లితగాని' వ్రేయుఁ డని యార్చెన్ దద్దళంబెల్లఁ గ
మ్మన కల్లల్లన వింజమాఁకిడిన తీరై పొల్చెఁ జిత్రాకృతిన్.

ఆలోన న్సిడివ్రేయ సిద్ధపడి రయ్యాల్ కొంద ఱామేళతా
ళా లేమీ? సిడిపోతు నల్లడల గల్లంతేమి? చప్పట్ల సం
బ్రా లేమీ? తకత క్తక త్తక పదప్రస్ఫోటనా లేమి! భి
క్షాలుత్సాహము సూపబోర్గాసియె హింసాసంకులధ్వానముల్.

బొట్టైనారసమున వెన్నుపట్టెఁబొడిచి
సీళ్ళ బంధించి సింబోతు సిడికిఁ దిగియ
బిట్టఱచె నాయఁడది విని బెగ్గడిల్లి
పరుగు పరుగున వచ్చి యాపట్టె మొడిచి, ౧౬

మీయత్యాచారములకు
సాయంపడు దేవుఁ డెంత ఛండాలుండో!
నాయసువు లుండఁగా సిడి
వ్రేయుదురే యంచు సీళ్ళు విప్పఁదొడంగెన్, ౧౭

ప్రేమాలోకము

అదలించిరి మోటుదొరల్
గదిమెన్ భిక్షాలు గుండెకా యగలంగన్
దుద కానాయని హృదయము
చదివినవాఁ డొక్కఁడైన జతపడ కచటన్, ౨౮

దేవాలయప్రవేశము
గావలెనని మాలమాదిగల గూర్పెట్టెన్
బాపుల 'నేక' మొనర్చెన్
దేవుఁడె లేఁడంట యెంత తిక్కలకొడుకో! ౨౯

ధనవంతు లన్న నుడుకుచుఁ
బనివాండ్రకు సమ్మెనేర్పి పై కెగవిడిచెన్
ధనమూలము కాదే జగ
మన వినఁడో వెఱ్ఱివెంగళప్పెప్పుడైనన్. ౩౦

సరి దప్పి సామ్యవాదము
గుఱి దప్పి పరాయికొలము గుఱిపడుచుండున్
నరుఁడే నారాయణుఁ డఁట
పరహింసయ నరకమంట పాపమితనికిన్. 3౧

వాకొందురేల మనలం
దేకువగల "లుల్లిగాఁడు" దిద్దునె సిడిపై
నూఁకుం డొప్పైఁ దేలును
గూళల ఫలమే మఁటంచుఁ గొందఱు పలుకన్. 3౨

కానిం డని నాయం డను
మానింపక యీాయకొన్న మరు నిముసమునన్
మానవులో? దానవులో?
కాని దురాత్మకులు వ్రేలఁగట్టిరి సిడికిన్. 33

దేశసేవకు నడుము బంధించువాని
పరుల బాధకుఁ గన్నీరు గురియు వాని
ఆత్మ సుఖదుఃఖములకుఁ గిమ్మనని వాని
కట్టి కుడిపిన దేపాపకర్మఫలమొ? 34

చిక్కనియుక్కు కొక్కెములఁ జేదుకొ నెన్నడి మ్రానుపైకినన్
దిక్కులు తీవరించినవి దివ్య పథమ్మొకసాక్షియై దయా
దృక్కులఁ దొంగి చూచినది దీనికి స్థావర జంగమంబులే
ఫక్కిని సాక్ష్యమిచ్చి నిలువంగలవో పరమాత్మ సన్నిధిన్.

వెచ్చని గుండెలో నడుగువెట్టిన భూతదయారసం బిటుల్
ద్రచ్చెడు మానవాధములు దాపున నిల్చిన ధర్మదేవతన్
జిచ్చుటికింతు రెందఱు హసించిన నాఁడు సమస్తభద్రుఁ డీ
పిచ్చికిఁ బిచ్చిపుట్ట మొఱవెట్టెను దానొక పిచ్చివాఁడునై.

సిడిబండి తొలిప్రదక్షిణ మాచరించెనా
గుడిచుట్టు మేళాలు గుబ్బతిల్ల
సారె కైశ్వరభయన్ వీరంగములు సాగఁ
గాళ్ళ గజ్జెలు గల్లుగల్లు మనఁగఁ

బటువాసకములఁ జొప్పడు గందపొడి రేఁగెఁ
గుమ్ము దుమ్ముగఁ గుంకుమమ్ము పెఱయ
నానావిధానూన నైవేద్యములు సెల్లెఁ
గ్రమకంకణ ఝణత్కార మెసఁగ
వీరగంధాదికము యథావిధిగ నడచె
జంతు వధ సాంతమాఁగె భిక్షాలు వేఁగె
నాయనిం గూర్చి మాత్ర మానాఁటి నుండి
ప్రజలు రోళుల రోఁకళ్ళఁ బాడినారు. ౩౭

ఉలిపి భిక్షాలు కిఁకఁ బప్పులుడుక లేదు
జుట్టు జుట్టునకును ముడివెట్టినాఁడు
అందఱకు ముల్లువుచ్చి కొట్టడఁచినాఁడు
చివర కూరెల్ల రెండుగాఁ జీల్చినాఁడు. ౩౮

ఆయింటిపైఁ గాక మీయింటిపై వ్రాలఁ
జెవులూడఁబొడిచి శిక్షించుకొనిరి
వాడుకీఁడాడన్నఁ గాదు కోఁడాడంచుఁ
ఇఱువాఁగులను రచ్చ కీడ్చుకొనిరి
అన్నదమ్ముల సరిహద్దు పద్దులపట్లఁ
గొంప గోణియుఁ గొల్లఁగొట్టికొనిరి
విజ్ఞోదుపడి నేల విడిచి సామొనరించి
ఫరగడంబడి నెత్తి బాదుకొనిరి.

పల్లె గుల్లయ్యె నుల్లముల్ కల్లలయ్యెఁ
జెత్తరకమెల్లఁ గొంపల గుత్తయయ్యె
భోగులెల్లరు మామూలు జోగులైరి
కొంటె భిక్షాలు పన్నిన కుట్రకతన. ౩౮

కలహ దీప్తి కిట్టి గ్రామాదులే కాదు
ధర్మరాజ్యమెల్ల దగ్ధమగును
కలహకాండ లేక గడిమైన జరుగునా?
మంచి చెడ్డ లేని మానవులకు. ౩౯

పండితుఁడని లేదు పామరుండని లేదు
అతఁడు మనుజమాత్రుఁడైనఁ జాలు
వెన్నతోడ నెన్నొ? విషబీజములు మొల్చి
పాప ఫలముతోడ బ్రద్దలగును. ౪౦

వెలిఁగెనా? మారులేకుండ వెలుఁగఁగలరు
ఆరెనా? పేరు లేకుండ నాఱఁగలరు
శాశ్వతముగాని జన్మకీ శ్రమల వేల ?
ఫలరహితమైన శ్రమలకీ పరుగు లేల ౪౧

# ప్రేమాలోకము

## అష్టమజ్యోతి

అప్పటి కాఱు వత్సరము లమ్మకు నబ్బకుఁ గాక భర్తతోఁ
ద్రిప్పలువడ్డ శాంత దన దివ్యచరిత్రము శాశ్వతంబుగాఁ
జెప్పుకొనం బరాత్పరుఁడు చిల్చిన ప్రేమరసస్రవంతిలోఁ
దెప్పలఁ దల్లక్రిందులయి తీరము సేరక నీరసించెరా! ౧

పువ్వుల మేడలోఁ గులుకు పుత్తడిబొమ్మని గుట్టుమట్టులన్
ద్రవ్వినఁ జిన్నమంతమయినఁ దాబదులాడక కప్పిపుచ్చినన్
జివ్వల బెబ్బులై మగఁడు చిచ్చెగఁజిమ్మిన వాఁడు సారెకా
నవ్వుల కాఁపురమ్మునకు నారక మక్కఱయొ? చెల్లెలో గదా?

పాలగులాబి మొగ్గపయి భ్రాంతి జనించినఁ దావులీనుదాఁ
కేలసహింపఁడో రసికుఁ డింద్రియ చాపల మెక్కుడైన భి
తూ లిది నేలరాచి యఱకాలను గేలను మట్టగించె నే
లీల గ్రహింప నేర్చుఁ జపలీకృతచిత్తుఁడు భోగ్యవస్తువున్. 3

దోసిటఁ బట్టి జవ్వనము తొంగలి తెప్పలఁ జూఱలాడు స
న్యాసి సమీక్ష సేయఁగలఁడా? లలనాహృదయంబు దాని క
భ్యాసము గావలెన్ మనసు పక్వముగావలె నేర్పుకూర్పు వి
న్యాసముగావలెన్ వలసినన్ దనువుం ద్యజియింపఁగావలెన్.

తేరకుఁ దేర దక్కెనని దీవెనఁ బ్రాలిడి పుస్తె గట్టి సం
సారము గూలఁ ద్రోచుకొను స్వాములు కొందఱు ప్రేమతత్త్వమే
తీరున గుర్తెఱుంగుదురు తియ్యము నెయ్యము లేని వారి పా
ల్బూరయఁ గుక్కలై నఁబడ వాయమయాతన చెప్పశక్యమా!

కొలువున శృంగభంగమయి కోరలు ఢుల్చినదాది నాయనిన్
బలుగున వ్రేయఁ జూచుఁ దన భార్యన మాంతము వట్టిగంగలోఁ
గలుపన చూచు వీరియెడఁ గాంక్ష జనించినవారి కండలన్
నిలువునఁ జీల్పఁ జూచు నతి నీచుఁడు నాగమనీని పుత్త్రుఁడున్.

కొండొకనాఁడు శాంత తనకూరిమిదైవముఁ జింతసేయుచున్
గొండలు గుండెలో డొలుపుకొంచుఁ బరున్నెడ నిప్పు లేకయే
మండుచునుక్కపిండ మధమస్థితి వోయి వచించు నోసి! బ్ర
హ్మాండము దల్లక్రిందులయినట్లు విచార మొనర్తు వేలకే ?

రవపూజల్ విరఁజిమ్మి కిమ్మనక సర్వస్వంబు నీతృప్తికై
తవులం బెట్టితిఁ దళ్కుబెళ్కుగల సద్దాపిల్ల, వందాల బు
గ్గవు, బంగారపు మొగ్గవంచు నిను నాకాంక్షించితిన్ గాని న
న్నవమానించి పరున్ వరింతు వని కాసంతైన గుర్తింతునే?

నాపాడ గిట్టకున్నఁ దొలినాఁడె వచించినఁ దీఱకుండునే
పాపిని! నాయఁడేమి ధనవంతుఁడొ? మన్మథమన్మథుండొ! నే
రూపసిఁ గానొ? నీమన సెఱుంగనొ? కోరిన కామధేనువై
చేపనొ? కన్నుగుట్టి చెడఁజెప్పిరి త్రిప్పిరి నీదుచిత్తమున్. ౧౦

ప్రేమాలోకము

కోటికిఁ గోటి సేయఁగల గొప్ప కుటుంబమునన్ జనించి కొం
డాటక మాడ నేర్చిన పటాణివి చక్రము ద్రిప్పు రాణి వి
ప్పాటి కుపేక్ష సేసినఁ బవల్ దివిటీ వెలిఁగింపకుందు వే
నీటిని నిల్వఁదీసి గమనింతువు విద్యుదుదార రేఖలన్. ౧౧

ఎందఱు తోడిసుందరు లభీష్టజన ప్రణయ ప్రసన్నలై
విందుకు విందులై సలుపు వేడ్కలు నామదిఁ గొల్లఁగొట్టు నీ
డెందము లోహనిర్మితమొ? దివ్యశిలామయమో! కరంగ దా
నంద విహీనురాలి భజనంబు నిరర్థక మెంత చెప్పినన్. ౧౨

ముదారఁ గట్టిన యద్దాల మేడలో
వేఁడి కన్నీటితో వేఁగినావు
అనురాగ మొలయించు నలవిరిసెజ్జపై
నిరతమ్ము నిప్పుక ల్గురిసినావు
మమత లీడేఱని మనమధ్యమున యంచు
నింగి దాఁకొను కొండ నిలిపినావు
తగునె? తల్లీ! యని తగవుసెప్పిన చోట
ఇర్వు పొర్వుల కెదురీఁదినావు
కమ్మపూఁదేనెలోఁ జేదు గలిపినావు
"తీర"నల్వురిలోఁ బర్వు దీసినావు
చెట్టపట్టిన దాది నేఁ జేసినదియుఁ
బాపమో? పుణ్యమో? పరాత్పరున కెఱుక. ౧౩

తరితీపు వలగొన్న నిఱుపేద చూపులు
నీరూపు రేఖ కంటించునాఁడు
గడెకొక్కతీరుగా నడిపించు కోర్కులు
నీ మనశ్శాంతికై నిలుపునాఁడు
నిట్టి నిల్వనఁగూలు నిందు ప్రాణంబులు
నీ ప్రేమకౌఱకు బంధించునాఁడు
ప్రత్యాశవడయని భావి చరిత్రంబు
నీ వర్తనమున వర్ణించునాఁడు
పనుగు చెడి వట్టిబయ లెగఁబ్రాఁకినాఁడఁ
ప్రతిపదమ్మున సంతృప్తివడసినాఁడఁ
అదను దప్పిన పదనయ్యుఁ దుదకు నిట్లు
పనికిమాలిన జీవచ్ఛవంబ నైతి. ౧౪

ఆటేండ్లు సెలవైన నధికార మున్నదా?
వలపువాసన గూరువాఁడఁ గానో ?
ముద్దుకై నను నోటి ముత్యాలు రాలెనా ?
వాసికై నను నింటివాఁడఁ గానో ?
పోని కమ్మని నవ్వు పూవులు విరిసెనా ?
వలకారి బాగుల వాఁడఁ గానో ?
ఎన్నఁడేనియుఁ గన్నువెన్నెల గాచెనా ?
వలచి పెండ్లాడినవాఁడఁ గానో ?

పెట్టిపోయలేని పెండ్లాము మగఁ డయ్యె
ఇంత బ్రతుకు బ్రతికి యెంతవడితిఁ
గొట్టి తిట్టనేల ? కొఱుత వ్రేయఁగ నేల ?
వలసినట్టు లింక మెలఁగ వచ్చు. ౧౫

భూములు బుట్ర లమ్ముకొని పోయెద మెచ్చటికైన నీవు నీ
స్వామియుఁగూడి ముచ్చటగ స్వర్గసుఖమ్ములఁ బొద్దువుచ్చుఁడీ
ప్రేమసుధానదిం గలఁత వెట్టితి వాత్మకృతైక దోష మీ
భూములు బుగ్గియైన విడిపోవునె? నాశ మొనర్పకుండఁగన్.

ఈ వాగ్బాణము లాయమ
పూవుటెదఁ దూసి చన్న బొటఁబొటఁ గన్నుం
గ్రేవల నశ్రువు లురలెఁ
భావజ్ఞుల కిట్టిప ట్లుపాదేయంబుల్. ౧౭

రేకులు కందకుండ సవరించి ద్విరేఫము పూవుఁదేనియఁ
గైకొన నేర్చుఁగాని పతగంబు మరందము లాననేర్చునే
ఆకలి బాబు కింతవఱ కన్నయొ? తమ్ముఁడో? తేలకున్నయీ
ప్రాకృతుఁ డాసుధామధురభావము దేక్రియ గుర్తెఱింగెడిన్.

గొసగాని పాలకై పొదుగుఁగోయు దురాత్ముఁడు మంచిచెడ్డలన్
మసియయినన్ గణింపఁ డనుమానము లే దెద చేదువుట్టగా
విస మొలికించినాఁ డొరులువిన్నఁ జెవుల్ వాడిపించుకొందురీ
పసరము తల్లక్రిందయి తపం బొనరించిన మోక్ష మబ్బునా?

వీని నికృష్టవాక్యములు వించుఁ జిరాకు పరాకు నొనర్పగా
బానసమందు నున్న యడబా లొక పర్వున వచ్చి పల్కెని
మ్మానవతిం గుఱించి కొఱమాలిన శంకలు వోదు వెందు కీ
మానవజన్మ మింత యధమస్థితిఁ బోయిన రుచ్య ముందు నే?

మొండిగులాములైన మొగమోటముదక్కి యుఁగ్రిందుమీఁదు
గాకుండవచింతురయ్య మొగమున్నదియద్దమువో లెఁబాపమె
న్నండయినన్ వృథాతొణఁకెనాబలిమి న్మొడి వెట్టినందు కీ
పిండము వేయుచుంటి వది పెట్టకయుండిన మున్గిపోయెనా?

దేవతలైన దిద్దుకొను దివ్యచరిత్రము గల్గినట్టి దీ
పావని యొళ్ళెఱుంగని సివంబయినం దృటిలోనఁ గన్నులా
పోవును జన్మ జన్మ కిఁక మోక్షము గల్గదు నీవ కాదు నీ
దేవుఁడు డిగ్గిరావలయుఁ జేకువ దక్కఁ గలంచియాడఁగన్.

తల్లియుఁ దండ్రియున్ రెటమతంబున మిన్నులువడ్డచోటునం
దిల్లడ వెట్టినారు వరియించిన నిస్తుల ప్రేమదైవమున్
ఇల్లెడఁబాపినారు తుద కీదురితమ్ము కతమ్మునన్ గృహం
బెల్లను గూలఁద్రోసికొని రీ దురవస్థకు మూల మెవ్వరో?

కామకళాప్రసంగ మిది కాదుసుమా? అమరైకభోగ్యమౌ
ప్రేమమువిక్రయింపఁగల రే మహితాత్ములు బాహ్యరూపమున్
గాముకు లాసచేయుదురు గావున భావన సేయు మెచ్చటో
ప్రేమ కుదుర్చుకొన్న నిజు పేద తపస్వినికై తపింతురా?

మన్మథ మన్మథుండయిన మానవతుల్ దలయెత్తి చూతురా?
జన్మముతోడఁ బుట్టువలె సత్యము, శౌచము, శీల మిన్నిఁటన్
విన్న సతీత్వ మంగనకు విశ్రుతకీర్తి ఘటించు దాననే
జన్మతరించుఁగాక కలుషస్థితిఁ బోయినఁ బుణ్యమబ్బునా?

తాన పటాణిమాయల కధర్మప్రవృత్తుల కగ్గమైన నో
నీ నయగారముల్ సొలుపునేరములుల్ జవిగాని వేరముల్
మానక యుందువా? పనికిమాలిన బాలికగాన నేఁటికీ
స్థాన మలంకరించినది చాలిదియే పదివేలు పుణ్యుఁడా! ౨౬

కమ్మని జవ్వనంబు కసుగందకమున్న మఱొక్కచో వివా
హమ్మయి ప్రేమసన్యసన మర్థి నొసంగినఁ గూడ దన్నదా?
సొమ్మకు సొమ్మలైనమిముఁజూచి వరింపనివార లుందురా?
ఇమ్మెయి రేవగల్ గలవరించినచో నగుఁబాటు గాదొకో!

నేఁ డిలుత్రొక్కి వచ్చి గమనించితివా? మొనగాఁడ! నాఁడునీ
వేడఁ జరించినావొ? గురుతింపవొ వీరి ప్రవర్తనంబులన్
వాడల వాడలం గలయఁ బాడిన వీరి వరాలకూరుముల్
వాడని పూవులై పరిమళ మ్మెగఁజిమ్మె రసప్లుతమ్మగన్.

పసవల్చు నొక వింతవన్నె చిన్నటికంబు
కన్నుదోయికి సంచకరువు గాఁగఁ
బిలిచినతోడ జొబ్బిల్లు కౌమారంబు
కలుపుగోలుకు సంతకమ్ము గాఁగఁ

గడలొత్తి చివురించు కమ్మని పాయంబు
        వలపుఁదావికి మామ వరుస గాఁగ
నిలువెల్లఁ బ్రసరించు నిర్మల ప్రణయంబు
        కలితనమ్మనకు సుంకమ్ము గాఁగ
మెఱసి నీశతమున మింటికి మంటికి
వేఱువేఱు దెసల విసరఁ బడిరి
పాప మెంత గలదొ! ప్రత్యాశ లే దింకఁ
గలుపు నేమొ? వల్లకాటి సామి. ౨౯

తమ్ముఁడ! నిన్నుఁగాదొక విధమ్ముగఁబల్కెద నీమెపాటు నీ
తమ్మ భరించునా? ములుచవై తెగఁజూచినఁబిచ్చితల్లి శాం
తమ్మును మోక్షమబ్బునుగదా? విషమిచ్చినఁ జిక్కుదీఱదా?
ఇమ్మెయిఁగుమ్ములాడఁ దగవే మగవారికి మాటిమాటికిన్
దేవియు దేవరయుంబలె
నీవును నీరాణి మెలఁగ నేర్చిన మాకుం
గావలసిన దేమున్నది
పూవులఁ గొలువుందు రెంత పుణ్యాత్ములకో ? ౩౦

చవిగాని మేళమున కీ
రవరవ లేలా? నిరంతరము నిరయమునన్
నవయుట మేలో వలచిన
పువుఁబోణిం గలిసి ప్రొద్దుపుచ్చుట మేలో ? ౩౧

## ప్రేమాలోకము

ఈ వెసఁ బెనఁగిన నిఁక నీ
భావిచరిత్రంబు ప్రణయభాజన మగునా?
పూవులు పుణ్యాత్ములకున్
గ్రావంబులు కర్కశులకుఁ గాంతల వలపుల్. ౩౩

అని తల వ్రాయం దిట్టిన
విని భిక్షా లాముదిన్న వింతపసరమై
గునపమునఁ గుమ్మఁదలఁకొన
జనకుఁడు పఱతెంచి పలికెఁ జాలుంజాలున్. ౩౪

ఎదురుఁగాళ్ళ మొలచి రేనియుఁ బూరుషుల్
స్త్రీలపట్లఁ జేయి చేసికొనరు
పడఁతి నోరు విప్పి బ్రహ్మను మెప్పించు
బురుషుఁ డెట్లు మెప్పవొంద నేర్చు. ౩౫

ఉన్న నాల్గుపిక్కలూ రేగినం గాని
తిక్కకుదుర దంతఁ దీఱఁగలదు
కొల్లఁబెట్టుకొన్న గుండగొయ్యల కేమి
పరుల నోళ్ళు గొట్టి బ్రదుకఁగలరు. ౩౬

పట్టు పట్టు మంచు బాజారు కీడ్తు రీ
చెడిపె లందుకొఱకె సిద్ధపడిరి
కొంప గూలకుండ గోప్యమ్ము చెడకుండ
జరుపుకొన్నవాఁడె పురుషుఁడోయి! ౩౭

పిచ్చి నరకఁ డేమొ పెండ్లాము ననుకొన్న
వంటలాపె కొళ్ళు మంట పుట్టె
కట్ట గట్టుకొనుచు గంగలోఁ గలువని
మ్రొందుకొఱకు వచ్చె నింత “రభస”. ౩౮

ఎవ్వరైనఁ జిల్లి గవ్వైన ముట్టక
తరలవచ్చు నడ్డుఁ దవుల మెందుఁ
గొడుకు వలయు నన్నుఁ గొండపైఁ గోఁతిని
గడియలోనఁ దెచ్చి కట్టఁ గలను. ౩౯

వాఁడుగానఁ జెల్లివచ్చిన దింతకు
జంతువైన దీని సైపఁ గలదె ?
ఆలుమగల సందు నఱగొఱ లున్నను
ఇంత పాపకర్మ మెందుఁ గలదు? ౪౦

కుడిచి కూరుచుండి గువ్వపిట్టల మాడ్కి
ఆరుపోరు లేక కేరవచ్చుఁ
జెండఁ జేర మొసవ సిద్ధింపవలెఁ గదా
ఎంత వారి కది లభింప వలెనొ ? ౪౧

ముదిసి మూఁడు కాళ్ళముద్దనయ్యుం గూడ
వీరికొఱకుఁ బరితపింపవలసెఁ
గష్టనిష్ఠురములు గనకుండ వినకుండ
దాఁటిపోమె నదియె ధన్యురాలు. ౪౨

ప్రేమాలోకము

కాఁపురంబొనర్పఁ గాలువెట్టెనో? లేదో?
కప్పురమ్ము వోలెఁ గరఁగిపోయె
గుట్టు మట్టు లేని కోడలు కోడలా?
ప్రక్కలోని త్రాఁచుఁ బాముగాక. ౭౩

కాలఁ దన్నుకొన్నఁ గాఁపురమ్ములు గావు
హద్దు దాఁటి చన్న నాలి గాదు
మనసు గుదురకున్న మగఁడైనఁ గొఱగాఁడు
తంతు దెలియకున్న దాసిగాదు. ౭౪

భార్యవలనఁ బూర్వ మర్యాద దలఁగును
కొడుకువల్ల నిల్లు గుల్ల యగును
దాసి కతనఁ గులము దగ్ధమై తీఱును
ధర్మ మెఱిఁగి వరుస దప్పిరేని. ౭౫

అదను గాచి పెదవి గదపక ముట్టించెఁ
బూఁకుఁ బాము పగిదిఁ బుట్టుకుంక
దీనఁ గ్రిందుమీఁదు దెలియక పడిపోకు
వింత పిచ్చిపిల్ల వేమె శాంత! ౭౬

నీ మూలంబున వంశము
కామక చిగురించు నంచుఁ గాంక్షించితి నీ
ప్రేమమ్ము పెద్దలై నా
కామితముం గడ్డలయ్యెఁ గడ కిటు లయ్యెన్. ౭౭

ఇది 'సుత' వంటలక్క యెదిరించిముఖాముఖి నిల్చి పెల్చునన్
బదరినజాడ విన్నఁ బసపట్టెదఁ బో పదవోయి! నాప! నీ
మెదుకుదనం బిటుల్ పరిణమించిన దంచు వచించి లోనికిన్
గదలెనో! లేదో! కాటుపులికై వడి నయ్యడబాల క్రుద్ధయై.

పిక్కల బిట్టు చూచుకొని క్రేలకు మెక్కడ తెక్కలమ్మినన్
బొక్కఁడు కూడు గుడ్డచటఁ బుట్టకపోదు పరాయిసొమ్ము నా
కక్కఱలేదు మాట లనినట్లయినం బడ మెక్కుడైన నీ
యెక్కుడు నీకపో కదలునే యుడతూపుల కేప్రమాకులున్.

కాదని వాదు లాడెదవొ? కమ్మని నోరను జేదుమేసి సం
పాదన చేయలేదు పదిమందిని రచ్చల కీడ్వలేదు నిం
పాదిగఁ జేరఁదీసి తలపై శిలఁగొట్టఁగలేదు కష్టమే
గాదిలి చుట్టమై నడుపఁగా గతకాలము వెళ్ళఁబుచ్చితిన్.

ఏలినవారి భాగ్యమునకే మదమున్నది తిన్నవారి మా
టేల? మిముంగుఱించి వచియించెడిదేమిఁకఁ? బెట్టి పోయఁగాఁ
జాలినవార లట్లు విరసంబులు వల్కెదరా? భవాదృశుల్
పాలకులైన మాదృశులు బంట్లు లభించెద రేమి చిత్రమో?

కులికెద వేమి కాఁదలచుకొంటివొ? కూటికిఁ బేదనైనచోఁ
గులమున కేమిపేద? కొడుకున్ గుణవంతుని గన్న సంభ్రమా?
కలగరవారి బిడ్డ కధికారము నిచ్చితి నన్న ప్రజ్ఞయా?
కులపతినైతి నన్న బెడఁగో? తుదిఁ దాఁకినఁ దేలునన్నియున్,

ప్రేమాలోకము

నీవును నీదు కోడలును నీ కొడుకున్ సుఖముండువారు నే
నే విషమైతి నిన్నిఁటికి నెన్ని వచించినఁ దల్లి దండ్రులే
కావలె భర్త గావలయుఁ గన్నకుమారుఁడు గావలెన్ సదా
దేవుఁడు గావలెన్ బరులు దీర్తుర? యార్తుర? కష్టనష్టముల్.

అని మాట ముల్లెఁ గైకొని
మన మత్యంతమ్ము దుఃఖమగ్నము గాఁగన్
గను లద్దుకొనుచుఁ బలికెఁ
బుఁజుకుచు శాంతమ్మ చిబుకముం జెక్కిళ్ళన్. ౫౪

నను గన్న తల్లి! శాంతా!
మన ఋణమా దీఱె నన్ను మఱువకు మమ్మా!
నినుఁ దప్పక కలిసెద నీ
తనువునఁ గాకున్న మఱొకతనువున నైనన్. ౫౫

చిట్టకము లెఱుఁగవమ్మా!
ఎట్లు జనించితివో? కాని యీ కాలమునం
దిట్టి యమాయికురాలిని
బుట్టించిన మాలదైవమును నేమందున్? ౫౬

నిను దెలిసి నీ నిరాస్థను
గనుఁగొని మోదార్చువారు గలరో? లేరో?
ధన ముండి ధర్మ ముండియుఁ
దనువే లేకున్నచో వృథా శాంతమ్మా! ౫౭

ఎవ రెంత యన్న నీ తల
పువు వాడినఁ గరఁగిపోతిఁ బుట్టెఁడు దుఃఖం
బెవరైన భరించెదరా ?
భువిలో నీ వంటి తల్లి పుట్టకయున్నన్. ౫౮

కనులఁ గన్న నాకె కడుపు చెర్వైపోవుఁ
గన్నవారి కెంత కలఁత గలుగుఁ ?
గటికి రాయిగూడఁ గన్నీరు విడువదా ?
నీ చరిత్ర విన్న నిముసమందు. ౫౯

అయిన దొక్కటఁ డంద అనుకొన్న దొక్కటందు
ఈశ్వ రేచ్ఛ కన్య మేల జరుగు?
దోసకారులకునుఁ దోడ్పడు దైవంబు
మంచివారి కెటు లభించునమ్మ! ౬౦

ప్రేమ కొఱకుఁ బుట్టి పెరిఁగిన దానవు
నీకు లోకమునకు లాకి గాదు
నిన్ను గొలిచి శాంత మున్న దీలోకానఁ
గష్టమందుఁ బాలికాపు గాఁగ. ౬౧

నీ కంటి నీట నేనును
నా కడుపున నీవు నిన్నినా ఘ్నంటి మిఁకన్
నా కే బావియొ? చెఱువో ?
కాక మఱే మున్న దనుచు గడపం దాటెన్. ౬౨

అప్పటి శాంత వాలకమునం దపరూపము గోచరించెరా
చిప్పిలు బాష్పముల్ కలికి చెక్కుల లేఁత గులాబిరంగులన్
గప్పిన పూర్వు కాఁకలు ముఖద్యుతులన్ గబళించె నింక నేఁ
జెప్పెడి దేమి యాకృతి విశేషము మీమది కెక్కకున్న దాఁ

అత్తఱిఁ దండ్రినిం గొడుకునైనను గత్తిని వ్రేసి చూచినన్
నెత్తురుబొట్టు లేదు గమనించితిరా? పెదబాబు చేతిలో
సత్తువ యున్న పోని నలుసంతయినన్ జినబాబు చేతిలోఁ
బెత్తనమున్న నిప్పటికి పిండిడ కుండెదరే 'లభంగులై'.



# ప్రేమాలోకము

## నవమజ్యోతి

ఉడికిన దూగుసాంత మపు డున్నది లేనిది సేర్చి చెప్పికోఁ
దొడఁగిరి భార్య భర్త పెడత్రోవలు వట్టిన దూయఁబట్టరా!
పుడమిజనంబు లిట్టియెడఁ బూజ్యులకేనియు లేనిపోని వే
కొడిమెలు నెత్తిఁగట్టి యుసికొల్పుదు రల్పులదేమిచిత్రమో!

నాఁడతండేమి పదిరెనో? నాఁటినుండి
పచ్చిగంగైన ముట్ట దాపసిఁడిబొమ్మ
మూఁడునాళ్ళొక్క ప్రొద్దయి ముడుఁగఁబాఱి
సెగలు పొగలొత్తు కన్నీటఁ జిగురు దొడఁగ. ౨

కటికి చీఁకటి గది నిండు గర్భమందు
నిలిసీడల కౌఁగిఁట నిదురఁ బుచ్చి
శాంతి దేవత తన మనస్తాప మెల్ల
ఊర్పుగాడ్పుల కపుడప్పు డొప్పగించె. ౩

ఊరడిలఁ బల్క నోరు రా కోర్పుగదుర
శీర్ణకుంతల నానఖశిఖము నిమిరి
అణువు సైతము తన దుఃఖ మభ్యసింపఁ
బుడమి యొడ లగు టెఱుఁగ దాపూవుఁబోణి. ౪

ప్రేమాలోకము

చిత్తము ద్రవించి కొలుకుల నత్తమిల్ల
మాటిమాటికి జారు కన్నీటిబొట్లు
వాలు చెక్కిళ్ళ ముత్యాల వాన గురిసి
జలమయము దేహ మని చాటెఁ బొలఁతి కపుడు, ౫

కడలు దొట్టిన శోకాంధకారమునకు
బయలువట్టిన తేజఃప్రపంచ మొండు
పచ్చికా టాటకుండఁగాఁ బలుకఁబాటి
దివ్యమూర్తిని నాశీర్వదించి చనియె. ౬

గాలి కైరటమ్ము నాసికాగ్రమ్ము సోఁకి
ఉదుకు మెదుకయి మరలిన దూర్ధ్వమునకుఁ
బ్రాణవాయువు మాత్ర మాపడఁతి మీఁద
జాలిపడి నిల్చియున్న దీక్షణము దనుక. ౭

తొంగి చూచినవో దుఃఖతోయదములు
పొంగి పొరలినవో యశ్రుపూరములును
కసరి విసరినవో యూర్పు గాడ్పులును
కడకు జీవితగాథయే గగన మయ్యె. ౮

ప్రకృతి భరియింపలే కేమొ? పండ్లనూటి
కసరుచున్న దజాండమ్ము గ్రక్కతిల్ల
అసలు మూన్నాళ్ళ ప్రొద్దయ్యె ముసురుపట్టి
జబ్బబంటెగ దేశమ్ము జవికిపోయె. ౯

ఒక్కొకమబ్బుతునకకు మఱొక్కకతునకలగించిచొక్కపుం
గొక్కములైన పీకుధరకోటులు తద్గత మేఘపంక్తులున్
తెక్కలుసాఁచి గాడ్పు బెదరింప సరాసరి దిఙ్ముఖంబులన్
ద్రొక్కియు నంతకంతకు నెదుర్కొనె మింటికిమంటికేకమై.

జిల్లని జల్లుజల్లునకు సీతువుతోడయి ప్రాణికోటులన్
దల్లడపెట్టె వంటచెఱ దైవ మెఱుంగు నొడళ్ళు తోళులై
పుల్లసిలెన్ సదా పొటుకు పుట్టిన గీములు నీటిబుగ్గలై
వెల్లువగట్టె గోడలు గుబిల్లు గుబిల్లునఁ గూలి సాల్పడెఁ. ౧౧

చిత్తడికాలికిన్ మొగులు చేతికిఁ గాఁ బ్రజ దాళిగుంటలన్
ముత్తెములై తపింపఁజెడు మూర్త మమావసియాదివారమొ
క్కొత్తున దాపురించె నిఁక నేమి తుపానుకళల్ గనంబడెన్
మొత్తములై మొగుళ్ళుపుడెముంచుకొనె న్దిశలొక్కపెట్టునన్.

ఎండ్రి కలుఁగు మూసె నెడగొత్తె కను మూసెఁ
బలుగుఱాతి కొండలు పులకరించె
దిక్కు దెలుపలేక దిక్కూచి భేదిల్లెఁ
జూడు మీ తుపాను చోద్యమింక. ౧౩

బాహాప్పళించి ప్రభంజనుం డలవోక
భూతలంబెల్ల నుర్రూఁతలూఁచె
బయలూడ గర్జించి పర్జన్యుఁ డాపోవ
జలధు లేడింటిని జల్లులాడె

ప్రేమాలోకము

ఎడపెడఁ బడు నుఱుకు పిడుగు లుగ్రమ్ములై
బడబాగ్నికీలల వెడలఁగ్రాచె
విశ్వమ్ము వెలిఁగించు విద్యుత్ప్రసారమ్ము
కాఱుమబ్బులగుండె లారఁబట్టె
ఎల్లెడల వల్లమాలిన వెల్లివాడిచి
గుంటమిట్టలు చదునయ్యెఁ గోట్లకొలఁది
జీవులు నశించె నొకటని చెప్ప నేల
మచ్చుచెడిపోయె నపు డాంధ్రమండలంబు. ౧౪

ప్రకృతి ప్రతిపదమం దతి భయదమైనఁ
లోక మీక్రియ నల్లకల్లోలమైనఁ
జిన్నమంతైన నాదైవ చిత్రమేమొ!
చెక్కుచెదరదు శాంత వసించు గృహము. ౧౫

ఉఱుముల మెఱుములతో జల
ధరపంక్తులు లగ్గపట్టి తన్మందిర సుం
దరవలభివాతపోతము
లఱుమన్ రొద సేయఁదొడఁగు నవసరమందున్, ౧౬

చంద్రవంకపొరలి జనపదంబెల్లను
ముంచి తేల్చె నొక్కమూర్తమందుఁ
బిడుగు మొత్తినట్లు భిత్తులు సౌధమ్ము
వఱుసపడి పునాది వరకుఁ గూలె. ౧౭

జనులు మాటుమణిఁగి సాఁబాలు కాలేదు
కాళరాత్ర మందు గాలివాన
శాంత గుండె లవిసి జలపూరమున యందు
దూల మూఁత గాఁగఁ దేలుచుండి. ౧౮

తనదౌర్భాగ్యచరిత్ర కీ భయదవృత్తం బైక్యమై యొక్క పె
ట్టున బోపెట్టిన లోఁగడంబడిన పాట్లుం గన్నులం గట్టఁగాఁ
దనలోఁదానిటు వెచ్చనూర్చి పలుకున్ దండ్రీ! విపద్బాంధవా!
నను గారించెద వేల నీరథము పైనన్ దావు లే దందువా?

మెఱపుం గన్నులు విచ్చి చూచెదవు గంభీరించి గర్జింతు వీ
వరుసం గుండలఁ గ్రుమ్మరించెదవు దేవా! నన్బరీక్షింప సం
బరమా! యిట్టి నికృష్టురాలిపయి గార్పణ్యంబు లే కూర కే
గురువుల్ వాఱెద వేలదీనులకు దిక్కున్ మ్రొక్క లేదందువా.

అలుగంగారణమేమొబోధపడదన్నా! పాపభాండమ్ము నా
తలపై బ్రద్దలుచేసినాఁడవు యథార్థంబున్న వాక్రుక్కచ్చి నన్
శిల వేయింపుము లేద నీచరణ దాసిన్ దివ్యచిత్తంబునన్
గలుపంజూడుముపోని నాహృదయ కైంకర్యంబు గైకొందువా!

కలవో లేవో మహాత్మ! యీభువనముల్గల్పింతువో? లేదో? నే
బిలువంబల్కవు నీలిమబ్బులపయిన్ విశ్రాంతిగైకొంటివో?
జలధుల్ పైకుసికొల్పుచుంటివో? మహా ఝుంఝామరుద్గర్భవీ
థుల దాఁగొంటివో? కానరావుమఱియెందుంగష్టకాలంబునన్.

వలపుందావుల ముంచి జీవులకు దాంపత్యంబు సేకూర్చి న
వ్వులపాల్సేయుటన్యాయమా? యొకనిపైఁ బూర్ణానురాగబుంచి
ప్పిల వేఱొక్కనికంటఁగట్టితివె యీ విద్రోహకార్యంబు నా
తలపైఁ జుట్టి మఱుంగునన్ నిలుతువా? ధర్మాసనాధ్యాసివై.

ప్రణయముగ్ధురాలు పశుధర్మ మాశించి
యెట్టయెదుట సాక్ష్య మిచ్చు ననియ?
విధము తప్పి చన్న విశ్వసన్యాసినిఁ
బాఱఁబట్ట నేమి ఫలముగలదు. ౧౪

ధర్మతత్పరులకు దారి చూపించుటో
దుర్మతులను గూలఁద్రోచి చనుటొ
మంచి చెడ్డ లింతమాత్ర మ్మెఱుంగవా?
అంతు పట్ట వెందు కబ్ధివోలె. ౧౫

ఈ పాపం బొడిఁగట్టుకో దగునటోయీ! పుణ్య పాపంబులన్
రూపున్ మాపుము స్వర్గనారకములన్ రూపింప కీసృష్టి నో
ర్కే 'పంధన్' నడిపింపు మేమయినఁ గాని మ్మండ పిండాదిక
వ్యాపారమ్ము వృథాశ్రమంపడిన లాభంబేమి సర్వేశ్వరా!

పుడమి బీరువోక పుణ్యవంతంబైన
సృష్టి కెందు లోటు చెప్పవయ్య!
కుడిచి కూరుచుండి కుమ్మరి వడువున
వింత ఘటములను సృజింతు వేల? ౧౬

నన్ను వంటి జీవు లెన్ని కోట్లు నశించుఁ
దిరిగి నీవు కన్ను దెఱచు లోనఁ
గన్న కడుపు గాదో? కరుణాళుఁడవు గాదో?
పెట్టి పోసి మమ్ము పెంపలేదో? ౨౮

పోని నీవు సొత్తె భూతప్రపంచంబు
కోరి కాలరాచుకొందు రన్న
లోక మన్న కరణి లేకి సంతసమైన
నిష్ప్రయోజనంబె నీదు సృష్టి. ౨౯

ఎపుడు చూతుమన్న నీ భూతకోటికిఁ
జావు, పుటుక లేని సమయ మేది ?
నూత్న సృష్టికిం బ్రయత్నింతువా ? లేక
ప్రాఁత సృష్టి నమలు పఱతు వన్న ! ౩౦

అరుణగర్భమందు నగ్నికుండము లేల ?
చంద్రునందు నమృత జలధు లేల ?
శౌర్య మొక్కకంట శైత్య మింకొకకంటఁ
గురిసి మమ్ము నేలుకొందువంట. ౩౧

లంకెకు లంకెలయ్యుఁ దెరలంబడి వచ్చు తరంగపంక్తులన్
గ్రుంకి పదేపదే మురిసికొందు విదెక్కడి పాపకర్మ మా
వంకకుఁజూడవో ? శివశివా! మృతిఁజెందిన మాతృగర్భ ప
ర్యంకమునందు నుండి నగినట్టుల నున్న మృతస్తనంధయున్.

ఆ కసిగందు బైటపడు నంతకు దుర్భర గర్భనారకం
బేకరణిన్ సహించెనో! జనించిన పిమ్మట రక్షణార్థమే
పోకలు పోయెనో తెలియఁబోదిపు డొక్కనిమేషమాత్రలోఁ
బైకొని తల్లి బిడ్డ నెడఁబాపిన వుగ్రతరంగమాలికల్. 33

వలిగొని తెట్టెఁగొట్టుకొనివచ్చుపులుంగులమోహనాకృతుల్
జలముల పాలొనర్చితివి జంతు కళేబరముల్ సమున్నత
స్థలముల మండెవైచితివి స్వామి! భవన్మహిమంబుచాటఁగాఁ
నిలిచి యొకండవే ప్రళయ నృత్యమొనర్చితి వంత కంతకున్.

ఈ పెనుబండ లన్ని పెకలించి తరంగిణి నోలలార్తు వా
తాఁపున కగ్గమై చెడిన తాళవనంబునయందు గుండముల్
రూపఱుచున్న వెప్పుడు నిరూపణ సేయవు చావుపుట్టుకల్
పాపమొ? పుణ్యమో? బయలుపడ్డయనంతరమే స్ఫుటంబగున్.

ఒక్కొక గ్రుక్కగావు సకలోదధు లొక్కొక యూర్పుగాదన
ల్దిక్కుల గాదు పొక్కొక ప్రతీకముగా దఖిలాండకోటి నీ
వెక్కడివాఁడవో? తెలియ దీశ్వర! నీమహిమానుభావమిం
దెక్కడఁజూడనక్కడ నతీంద్రియమై పొడకట్టుచుండెడున్.

నాచరిత్ర నూచి నవ్విన లోకంబు
నిన్ను పరిహసించి నిలువఁగలదె?
నీవిలాస మెడలి నిర్మించు బంధంబు
ప్రణయమహిమ బయలు పఱుపఁగలదె. 32

తల్లిదండ్రు లింత దయ దప్పి నడచిన
ధర్మమూర్తి వెందు దాఁగినావు
ప్రజలయెదుటఁ బెట్టి పరువుదీయుటకన్నఁ
గట్టఁగట్టి గంగఁ గలుపరాదె? ౩౮

చూపోపకున్న మ మ్మొక
దాపున శిలలైనఁ జేసి ధారణినెల్లన్
మాపైన మోపరాదా?
పాప మ్మున్నంత దనుక భరియింతుముగా. ౩౯

నేరము వాటించిన నీ
పేరు టలలలోనఁ జిదిమి పెట్టఁగ రాదే
పారమ్ము ముట్టఁగా నీ
కీరితి గుసగుసలువోయి గీతింతుముగా. ౪౦

మ మ్మిరుపాయుల జల పూ
రమ్మొనరించినఁ బరస్పర ప్రణయమునన్
నెమ్మదిగా జలనిధిఁబడి
చుమ్మలు చుట్టుకొని కలిసి సుఖయింతుముగా. ౪౧

అద్దరి నిద్దరిగా మ
మ్మిద్దఱ సృజియించి విడిచితేని మహాత్మా!
పెద్దయు గాలం బీ సరి
హద్దులమై చంద్రభాగ నలరింతుముగా. ౪౨

## ప్రేమాలోకము

తృణమైనఁ గాని నాయని
ప్రణయక్షేత్రంబునందు ఫలియించెద నీ
ఋణ మురకపోదు కక్కా !
ప్రణయోన్మాదుల కొకింత భద్రము గూర్పన్. ౭౩

నాకై లోకము మఱచెన్
జీకాకుల నెన్నో గుడిచెఁ జింతాజలధుల్
పైకొన నీకై పఱచెన్
జేకొంటివా ? నన్ను బోలె శిక్షించితివో ? ౭౪

సాఁకుకొన్నతల్లి చచ్చి యేలోకాన
మసలుచుండెనయ్యొ ? మమ్ము విడిచి
సత్యవంతురాలు చరితార్థురాలయి
పూలతెప్పమీఁదఁ దేలిపోయె. ౭౫

కడుపున దాచుకొన్న దర కాళులు ముద్దిడుకొన్న దాశలన్
గడె కొకఁ డల్లుకొన్న దది కా దిది కాదని నా సపర్యకై
యొడలని మానుకొన్న దిఁక నూపిరిపోయెడు వేళ నాకునై
విడిచిన కంటినీరు పృథివిం గదలించెనఁటే పరాత్పరా! ౭౬

అట్టి మహాత్మురాలి చరణార్థము నాయెడ లూడ్చి చెప్పులన్
గుట్టినఁ దీఱునా ఋణము కోమలపాద పరాగ రేణువుల్
ముట్టినఁ బాయదా?యఘము మూర్తివిశేష మొకింతకన్నులం
గట్టినఁ జాలదా? భవ వికారములెల్ల నడంగు నొక్కటన్.

ఆతల్లి సేవలెట్టి
పాతకురాలికి లభించుఁ బద్మానాయం
డే తప మొనరించెనో ? యీ
మాతృస్థానమున లోకమాన్యుండయ్యెన్. ౪౮

ఆ నెయ్యము, తియ్యము నా
మేనత్తకుఁ గాక యొండు మేదిని గలదా ?
తా నెంత సత్యవతియో
సూనుండును నంతకంటె సూనృత ప్రియుఁడున్. ౪౯

మేమీ యనంత పథమునఁ
బ్రేమ విహంగములమై చరించుట కానాఁ
డేమే మూహించితిమో ?
స్వామీ! యాయూహ లడ్డచాళులఁ బఱచెన్. ౫౦

ఆ మహనీయుని ప్రేమా
రామమ్మునఁ బుష్పమై పరాగకణమ్మై
ఆమోదమ్మై మధువై
ఆమూలాగ్రమ్ము లీనమైతి మహాత్మా! ౫౧

ఆ పాపము పండినదా ?
దాపరిక మ్మేల యింత దయ దప్పుటకున్
నీ పాద మాన ప్రణయ
వ్యాపారము సేయనొల్ల నఖిలాండపతీ!.

కడచన్న దేమొ చన్నది
తడయక నా ప్రియుని దివ్యదర్శనమైనన్
గడచూపు చూచి ప్రాణము
విడిచెద నని వేడుకొనియె విశ్వంభరునిన్. ౫౩

ఇచ్చట దుఃఖపీడ నివదించిన నాయని యంతరాత్మలోఁ
జిచ్చురగుల్కొనెం బ్రకృతిచిత్రము లారయ లేరు మానవుల్
నచ్చనివారు హేళన మొనర్చెడివే మతిమంతులైన వా
రిచ్చకుఁ దెచ్చికొందు రివియే జననాంతర సంగతార్థముల్.

మునుముందేఁగు తరంగమాలికలతో ముద్దాడు విద్యుల్లతల్
తనపై నాట్యమొనర్ప నీటఁబడి పద్మానాయఁడేకాకియై
ఘనవాతాహతఫేనసంగతతరంగశ్రేణి నూటాడుచున్
జనుదెంచెన్నదు రేయిఁ దెప్పపయిఁ జంచచ్చంద్రభాగానదిన్.

తనవెన్కం బదిబారలందొరసి పద్మానాయఁ డో ప్రేమభా
జనమా! యన్న గిరుక్కునందిరిగి మస్తంబెత్తి యల్లల్లఁద
ద్ధ్వనిచాయం దిలకించు శాంతహృదయ వ్యాపార మేదివ్యలే
ఖని చిత్రించినఁగాని భావుకుల కాక్షేపంబు సంధిల్లదా!

ముమ్మరమగు తమకమ్మునఁ
గమ్మని హృదయములు రెండు కౌఁగిటఁ గరఁగెన్
ఇమ్మధురఘటన కీ సం
ఘమ్ము సహింపక విషమ్ము గ్రక్కక యున్నే? ౫౪

అతనియంకతలమ్మునయందు లేఁత
తములపాకయిపోవ శాంతాకుమారి
తెప్పఁ దెమలించి వచ్చిన తెన్నువట్టి
నాయఁడాత్మకు సూటిగా నడిపినాఁడు. గీ॥

వాఁకకు వాఁక కగ్గమయిప్రాలుచుఁ బైకొను కోడె తెప్పలం
ద్రోఁకుచు మాటికిం దెరలఁ బాఱుచుఁ బైపయిఁ దేలియాడున
య్యాకృతు లేమి కాఁగలవొ? యవ్వలిగట్టును జేరలేక య
స్తోకలఁబోవువానిఁగని రాయఁడు తీరనిషణ్ణుఁడార్తుఁడై. గీ॥

ఈదృశ్యంబున కేతపించితిని నెన్నేనాళు లావేళ నా
కేదో కొంత మసించి చేడ్పడితిఁ గానీ నల్వురన్నట్లు నేఁ
గాదన్నం దలఁద్రుంచువా రెవరు చక్కంబెట్టువా రెవ్వ రీ
చేదుం ద్రింగి భరించుకొన్న పశు విస్సీ యేమి గానున్నదో?

ఈబిడ్డన్ మెడఁజుట్టి సర్వమిఁక నీదేసుమ్ము వేంచేయరా
బాబూ! యన్న భరింపఁడా? నిజముగాఁ బద్మయ్యతో సాటిగా
రాబోళాతన, మాపరోపకృతియూ, యౌదార్యమూ, నేర్పుకూ
ర్పా బంగారపుఁ గొండకే తగును ప్రాయంబేలకో? కాల్పనా!

అనుకొన్నట్లొక వీరి మూలమున వంశాంకూర మేర్పడ్డ నా
తను వేమీ? ధనమేమి? నన్వలె మహాధన్యాత్ముఁడింకొక్కఁడుం
డు నె? బంగారమువంటియావలపు "బోటుల్" భగ్నముం జేసితీ
అని పాపం బాడిఁగట్టుకొన్న ఘనుఁడీ రాయండొకండేకదా?

నరు లోడఁగూర్పరాని ఘటనంబిది పాపమొ? పుణ్యమో? పరా
త్పరునిదె నాయభీష్ట మటువారి యభీష్టము నైక్యమైన వీ
తరుణమునందు నీయమృతదంపతులం గనుగొన్న కన్నులన్
బరులను జూడనొల్లవని పాపమతం దొరిగెన్ స్రవంతిలో.

కనులారఁ దండ్రిపాటుం
గని గుండె గుబిల్లుమనఁగఁ గళవళపడుశాం
తను నాయఁ డూఁడిపట్టుచుఁ
బనుగుంఁజెడి ప్రాణ మన్న పట్టెడు వేళన్. ౬౪

ఈశ్వర ప్రేరితంబేమొ? యెగువమిట్టఁ
బెద్దపెట్టునఁ గొండంత పెనక విరిగెఁ
దెములువుట్టిన దయ్యేటి తెప్పలందు
గున గున ధ్వనించెఁ బెనుసుడిగుండ మొకటి. ౬౫

అట్టిటు తరంగపంక్తి నుయ్యాలలూఁగి
కడుపుఁ జుమ్మలఁ బలుమారు కలఁతఁజెంది
కడలుగానక లోయలు గౌఁగిలించి
కొట్టుకొనిపోయె నొక కలిగొట్టుపూవు. ౬౬

# ప్రేమాలోకము

## దశమ జ్యోతి

ఒకటి రెండు నాళు లూడనిఁ బాడుచు
వాఁగుప్రవంత లన్ని మూఁగవాతెఁ
'బస్తి' వేసి చుట్టు పరగణా గాలించి
రాజు బాజు లోపి నంతవట్టు. ౧

ఆ రెండునాళ్ళ భిక్షా
లారెకులం గలిసి వెదకె నయ్యె గళవుల్
చూటుల బారులు దీరిన
వారికినై పాప మింత వలపెందులకో? ౨

ముకు దుస్సిన పసరం బీ
రకమై మినువట్టి తిరిగె రాత్రిందివముల్
సుక మెఱుఁగఁ డామె కతమున
అకటా! యీ వెఱ్ఱిప్రేమ కర్థ మదేమో? 3

ఒక నాఁటి వేగుఁబోకన
వికలేంద్రియుఁడై శ్మశాన వీథీమధ్యన్
ముకుమందై యేస్చు నొకా
నొక దుర్గంధ ప్రదేశ మొంటిగఁ జొచ్చెన్ ౪

ప్రేమాలోకము

శల్యరాసులమీఁద శ్మశాన లక్ష్మి
పవ్వళించిన విశ్రాంతి భవనమిద్ది
కాలగళుఁ డెత్తి మొరయించు కంచు ఢక్క
బోరుకొనుచుండు నుత్తరద్వారమందు. ౫

ఈ పృథివి సొంత ముత్త్రాఁత లూపినట్టి
మానవ కపాల పంక్తుల మధ్య నురక
పరువు లిడుచున్న ప్రత్యూష పవనములకుఁ
బొంగి భిక్షాలు దేహమ్ము పులకరించె. ౬

తన కేకళ్లము ప్రాప్తమొ ?
యనుకొని తెలదుమ్ము క్రింద నాసీనుండై
మునిపంట గోరు గఱచుచు
మన భిక్షా లిట్లు మాటిమాటికిఁ దలఁచున్. ౭

ఇచ్చటఁ గొల్వుదీర్చునరులే క్రియఁ దాద్మశ మోహనాకృతుల్
చిచ్చుఱికించిరో ? మురువు చిందెడి శల్యము లెట్లు రాల్చిరో?
వెచ్చని గుండెకాయ నెటు వ్రేల్చిరొ వారల దివ్యభోగముల్
మచ్చుకుఁ గానరా విచట మన్నయి యేకరణిన్ సుఖింతురో?

ఈ పుణ్య భూమి సొచ్చిన
స్త్రీపురుషులు మగిడిపోక చేరెదు నేలన్
గాఁపురముండి పరస్పర
శోపోద్రేకముల కెట్లు గుఱిగారబ్బా? ౮

ఎందఱు దేశోద్ధారకు
లెందఱు కవిసార్వభౌము లెందఱు నృప సం
క్రందను లిచ్చట మన్నె
యుందురొ! ముందెంద ఱగుదురో తెలియదుగా ? ౧౦

అమృత లేఖినికి నిప్పంటించుకొన్నాఁడు
కవిసార్వభౌముఁ డీ కాటిలోనఁ
బసిఁడితూలిక నింత మసిచేసికొన్నాఁడు
శిల్పివరేణ్యుఁ డీ చిచ్చులోనఁ
ఉక్కుదేహము భస్మ మొనరించుకొన్నాఁడు
పోటుబంటీ రుద్రభూమిలోనఁ
బాలబుగ్గలు మంటిపాల్సేసికొన్నాఁడు
పురిటిబా బీపాడుబొందలోన

మంటలో మంటిలో నిట్లు మాయమయ్యెఁ
బ్రకృతి శాసించి విడిచిన ప్రాణు లెల్లఁ
బాంచభౌతిక మేమైనఁ గించ ల్లేదు
వమ్ముగాని యశశ్శరీరమ్ము గలదు. ౧౧

గాలిలో ధూళిలో వల్లకాటిలోనఁ
గమిలి కుమిలిన నిప్పుల గద్దె మీఁద
మానవాకృతి దేహధర్మమ్ము విడిచి
సుడులు సుడులయి కొట్లాను గడియలోన. ౧౨

నరులు జయించుకొందు రనినారఁటో! యే తలి చన్ను బాలతోఁ
బెరిఁగిన యెమ్ములో? యిచటఁ జేరిచి రగ్నిపరీక్ష కగ్గమై
కరఁగి నశించిపోయిన యొకానొక మానవదేహ మిద్ది యీ
గటికపయిం బరుండి కలకాల మదెట్టులఁ గన్నుమోడ్చునో?

పక్కన నవ్వుచున్నవి కపాలములం దొకకొన్ని రేపు మా
ప్రక్కకు రాక తప్ప దను భావమొ సుమ్మది గాక శాశ్వతం
బిక్కడఁ గాని మేము వసియించు తలంబు శిరంబు గాదు మా
హక్కులు సెల్లి రావు మసిమైన నిదే పదివేలు జీవికిన్. ౧౮

క్రూర దివాంధ మొం డినుపగోళు లదేపనిగా సమాధిపై
నూఱఁదొడంగె నందలి మనుష్యకళేబరమించు కేనియున్
నోరు మెదల్ప దెందుఁ? ఘనుల్ పవళించు సమాధిమందిర
ద్వారము లీదివాంధపరివార పరాభవముల్ భరించునో!

అనురాగం బెసకొల్పి చన్నపతికై యల్లాడు నేసాధ్వి వె
ట్టిన దీపంబొ! సమాధిపైఁ గునుకుచుం డెన్ దత్సమీపంబునన్
మినుకంచున్ వెలుఁగొందుచుండి స్మృతులిం దేవాంఛలీడేఱ వె
చ్చనికన్నీళ్ళఁ బరిభ్రమింతురఁటె నిచ్చల్ యాతనాదేహులై.

కటకుం గత్తులఁ గుమ్ములాడుకొని శిక్షాదండముల్ దాఁచి వ
చ్చిరి భూపాలకు, లిండ్లు వాకిళులు విచ్ఛిన్నంబుగావించి వ
చ్చిరి సామాన్యులు వారు వీరని విమర్శింపంగ నేలా పరా
త్పరు పిల్పందిన రాకతప్ప దిట కాలుం డెంతవాఁడేనియున్!

ఇట మౌనవ్రతదీక్ష గైకొననివారే లేరు నోరెత్త కి
చ్చట వర్ణాశ్రమ ధర్మతత్పరులు దీక్షాకంకణం బూడ్చిరీ
వట వృక్షంబున గబ్బిదయ్యములు దర్బారున్న వేమాత్ర మి
చ్చట ధర్మ చ్యుతి గల్గినన్ భవుని యాజ్ఞన్ జించి చెండాడ వే?

అనుచు నలువలంకులను దృష్టి సారించి
వల్లకాటికివలి పల్లమందు
భీతి గదురఁ జూచె బీభత్స దృశ్యంబు
జవుకుపుట్టి గుండె జల్లుమనఁగ. ౧౯

ఆ జలప్రళయమ్మున కగ్గమైన
ప్రణయతాపసు లీ తెన్ను పట్టినారు
హృదయములు పాప మేమేమి చదువుకొనునో
పట్టు విడనేర వా బాహుబంధనములు. ౨౦

కల్పితాచారములు వింత కట్టుపాట్లు
అకలుషంబైన ప్రేమము నడ్డుకొనవు
వలసినట్లైనఁ దెగఁబడ వచ్చుఁగాని
పాపచింతన లిహ పర బాధకములు. ౨౧

బ్రదికి దాంపత్య సౌఖ్యమ్ము వడయకున్నఁ
జచ్చి సాధించి రాస్వర్గసౌఖ్య మైన
భగవ దుద్దిష్ట మైన దాంపత్యమేని
మరణశయ్యను సైతమిమ్మాడ్కిఁ బొదలు. ౨౨

ప్రేమాలోకము

అగ్నిసాక్షిగఁ బెండ్లాడి నట్టియువతి
పరుని కౌఁగిటఁ గనుమూయు టరసినంతఁ
గుతలమునకు నమాంతంబు క్రుంగవలెనొ!
నిలువుఁ గాళుల నీఱుగావలెనొ! యెఱుఁగ. ౧౩

వాసిగల్గిన మన ధనదాసునకును
శిక్ష జరిగిన దిప్పటి కష్టరాలఁ
బుస్తెగట్టి గడించిన పుణ్యమేమొ?
చరణముల వ్రాలి పడసిన సౌఖ్యమేమొ? ౧౪

భీతికికీ భీతి లేదేమొ? పెద్ద తడవు
గాంచి భిక్షాలు కను లప్పళించినాఁడు
ప్రకృతి ధర్మమ్మొ! తన స్వభావమ్మొగాని
మానసమ్మొక్క త్రుటిలోన మాఱిపోయె. ౧౫

క్రుంగిన గుండెతో ముసురుకొన్న తలంపులతోఁ జెమర్చు క
న్నుంగవతోఁ గలంచెడుమనోవ్యథతోఁ బ్రియురాలిగాథతోఁ
[illegible]ంగళివారి బిడ్డ నడపీనుఁగువోలె శ్మశానవాటికిన్
గంగిరుశెత్తి హాల్గరఁగఁగా విలపించె విచారదూరుఁడై. ౧౬

పాపము పాప మింతగతి పట్టినదే మని ముక్కుపైన వ్రేల్
మోపనివారు లేరు కడు మూర్ఖులు పాపపు తల్లిదండ్రు లి
య్యాపద కెల్ల మూల మని రట్టి దరిద్రున కెట్లు దక్కు ని
క్షేపమువంటి పిల్లని వచించి రదేపనిగా నమాయికుల్. ౧౭